# అగ్రగాములు

రచయిత

వావిలాల సోమయాజులు, బి. ఏ.

*
* *

ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ, (రిజిస్టర్డు)
మద్రాసు :: తెనాలి :: హైదరాబాదు

 1957 [వెల : రు. 1/4/-

# తొలిపలుకు

వీర వనితలు, వీర మహాపురుషులు కర్తవ్యతావిమూఢములైన జాతుల నుద్ధరింప నావశ్యకములైన సమయములం దవతరింతురు. కారణజన్ములైన వారు కార్య సాధనానంతరము నిర్వాణపథము నొందినను మృతజీవులై నిత్యమును జాతి నుజ్జీవింప జేయుదురు.

అట్టివారు గుణగరిష్ఠులు, ఆదర్శమూర్తులు. ఇట్టి వీరుల జీవిత చరిత్ర పఠనము వలన నుత్తమలక్షణములు, నున్నతాదర్శములు వ్యక్తుల కలవడి వారిని దివ్యజీవన మార్గముల నడిపించు ననుట నిస్సంశయము.

ఝాన్సీ లక్ష్మీబాయి ప్రథమ భారతస్వాతంత్ర్య సమర నేతాటని. తిలక్ మహాశయుడు ప్రప్రథమముగ స్వారాజ్య శంఖారావ మొనర్చి, పరదాస్య శృంఖలాబద్ధులై క్రుంగుచున్న సోదరభాగినీయుల మేల్కొల్పిన వీర వైతాళికుడు. గాంధీజీ స్వాతంత్ర్యనౌక నహింసా సమర సాగరములందు కడుసామర్థ్య ముతో నడిపించి తీరమును జేర్చిన యద్వితీయ మహానావి కుడు. జీవితసర్వస్వమును భారత దాస్య విమోచనా కృషి కర్పించి విదేశముల వసించు భారతీయుల సమైక్య మొనర్చి వారిని సంగ్రామరంగమునకు పురోగాములై నడిపించిన యసమాన సమరసేనానాయకుడు నేతాజీ. —

వీరు నలువురును స్వాతంత్ర్య సమరయోధులు — అగ్రగాములు. వీరి జీవితాదర్శములను, కార్యసాధనారంగములను, విజయ

విశేషములను నిరూపించు గ్రంథమే నా 'అగ్రగాములు'. ఈ వీరమూర్తుల జీవితచారిత్రక ఘట్టముల పఠించి స్వతంత్ర భారత బాల బాలికలు దేశసేవా తత్పరతతో పురోగమింతురు గాక యని నా ఆకాంక్ష.

న న్నభిమానించి యీ గ్రంథమును వారి గ్రంథమాలలో నొక కుసుమముగ స్వీకరించి పాఠకలోకమున కర్పించిన ఓరియంట్ పబ్లిషిఙ్ కంపెనీ యజమాను లగు శ్రీ యం. యస్. శర్మగారికి నా కృతజ్ఞతా పూర్వక వందనములు.

—రచయిత

# విషయ సూచిక

# ౧. ఝాన్సీ రాణి

"పృథ్వీ! జననీ! నీ గర్భమునుండి జన్మించినాము; నీ గర్భమునే చేరుకొందుము. మా శరీరములు నీవి. మ మ్మెట్లు పాలింతువో! మాసేవ లెట్లందుకొందువో!! నే నార్థిక



సంపద నణుమాత్ర మర్థింపను. నా దామోదరుని మహావీరునిగ తీర్చిదిద్దు శక్తిని ప్రసాదించి వీరమాతయను కీర్తి దక్కింపుము. ధన్యురాల నగుదు" నని యుదయపూజావేళ వినమ్రభావముతో కరకమలములు ముకుళించి లక్ష్మీబాయి భూదేవి నర్థించినది.

తరువాత పురాణశ్రవణ మారంభము కావలసి యున్నది. 'ప్రారంభింపు' డన్నట్లు లక్ష్మి పౌరాణికునివైపు దృష్టిమరల్చినది. పురాణపఠనమును వినవచ్చిన నగరప్రజలును, పౌరాణికుడును మరియొకవైపునకు చూచుచున్నారు. ఆమె యాదిక్కునకు చూచినది. దివాన్జీ లక్ష్మణరావు, మోరోపంతులువచ్చి నిలచియున్నారు.

అత్యావసరమైన రాచకార్య మున్నగాని వారట్లువచ్చువారు గారు. గమనించి బాయిసాహెబ్ లేచి యేకాంత మందిరము వైపునకు బయలుదేరినది.

అట నేకాంత మందిరములో వారి సంభాషణము పూర్తియైనది.

బుందేలుఖండములోని ఝాన్సీ రాజ్యమును మోసముతో నాంగ్లేయులు లక్ష్మీబాయిభర్త గంగాధరరావు కాలముననే కాజేసినారు. ప్రస్తుతము భర్త మరణానంతర మామె దత్తపుత్రుడు దామోదరునకు పోషకురాలుగ దుర్గపాలన మొనర్చుచున్నది. ఈ దుర్గమునైన వారికి దక్కకుండ జేయుటకు వారేమైన నెత్తు నెత్తిరా యేమి !

దివాన్జీ మోరోపంతుల రాక కొకానొక రాచకార్యమున గవర్నర్ జనరల్ డల్హౌసీకి దక్షిణభారతమున ప్రతినిధిగ నున్న మాల్కొమ్ వద్దనుండి 'ఎల్లిస్' అను నాంగ్లేయ ప్రముఖు డొకడు వచ్చుటయే కారణము. కుశలప్రసంగము లైపోయినతరువాత నతడు మాల్కొమ్ వ్రాసిన లేఖను దివాన్జీ చేతికిచ్చి చదివించినాడు. రాణి వినినది.

"ఝాన్సీ నా కౌస్తుభము. నేను లక్ష్మిని. నా ఝాన్సీని నేను మీకీయలే" నని తెరవెనుక నుండి గంభీరస్వరమున నామె పలికినది. ఇట్టి మాట నాంగ్లేయుడు శతాబ్దము నుండి యెన్నడును వినలేదు. హృదయమును కుదుటబఱచు కొని ఎల్లిస్ యిట్లనినాడు :

"తల్లీ ! ఇది గవర్నరు జనరలుగారి యాజ్ఞ. ఇందులో మీకు క్రోధము కలుగవలసిన కారణము నా కేమాత్రమును గనుపించుటలేదు. ప్రజాపాలనా భారమువలన మీరు శ్రమ పడుచున్నారు. దానిని తొలగించి మాసమున కైదువేల రూప్యములు మీకుటుంబమునకు మనోవృత్తినిచ్చుటకాయన నిశ్చయించినాడు." అని మరియు నత డేమో చెప్పబోవు చున్నాడు. రాణి "మీ మనోవృత్తి నా కెందుకు ? నే గ్రహింపగల దేదో స్వీకరింతు" నని గద్దించి పలికినది.

ఆంగ్లేయుల దౌర్జన్యములను, కఠినశాసన పాలనా పద్ధతులను విన్న సభలో కలకలము చెలరేగినది. స్త్రీలు రోదనధ్వను లారంభించినారు. ఎల్లిస్ దివాన్జీని పిలుచుకొని పోయి మరికొంతసేపు సంభాషించినాడు. ప్రయోజనము లేదు. రాణిమాటలకు తిరుగులేదు. యుద్ధమున కప్పుడేయనుజ్ఞ నొసగవలసినదని వేడుకొనిన సరదారుల 'కిది సమయము కాదని' వారించి యామె దర్బారునుండి వెడలిపోయినది.

ఈవార్త యొకటిరెండు దినములలో ఝాన్సీ రాజ్య మంతయు ప్రాకిపోయినది. ప్రజ లెల్లరును దీని ఫలితాంశ మేమగునో యని యాతురత వహించుచున్నారు.

"నాకు దత్తస్వీకారమున కధికారము లేదట ! ఏదేశ స్మృతి ననుసరించి ? భారతదేశ స్మృతులలో దత్తపుత్రుడు

పుత్రుడు కాడని యెక్కడనున్నది? లుప్తసిద్ధాంతముతో దేశీ
యుల కేమిపని? ఈ ఆంగ్లేయుల లుప్తసిద్ధాంతముతో బాటు వారి
పాలనము నంత మొందవలసినదే!" అని రాణీసాహెబ్ నిశ్చ
యించినది. దివాన్జీతో సంప్రదించినది. అతడు రాజ్యపాలన
మున నరువది వత్సరములు గడిపి సమస్త మవగత మొనర్చు
కొన్న వృద్ధమూర్తి, ప్రతిభావంతుడు, మహామేధావి.
ఆంగ్లేయ ప్రభుత్వ మారంభమైనది మొదలు భారతదేశ
చరిత్ర మతనికి హృత్కవిలె.

"నా ఝాన్సీని వారి హస్తగత మొనర్పవలెనా? కుత్తు
కలో ప్రాణమున్నంతవర కది సాగదు" అన్న రాణినిశ్చయ
మునకు వృద్ధమూర్తి లక్ష్మణరావు సత్త్వప్రధాన మానస
ముతో నాలోచించి—

"అమ్మా! ఆంగ్లేయుల బల మత్యధికము. వారికి దేశ
మున మూడులక్షల సైన్యమున్నది. దీనికిదోడు ఫిరంగిసైన్య
మరువదివేలమంది యున్నారు. వారితో దలపడుటన్న
సామాన్యకృత్యము కా"దని పలికినాడు.

"అయిననేమి? అందులో విస్తారము దేశీయసైన్యము.
తాత్కాలికముగ వారిశక్తికి లొంగి మిత్రులైన దేశీయ
సంస్థానాధీశ్వరులు సమయమువచ్చిన సేనాడైన వ్యతిరేకింప
వచ్చును. వారిలో నే డంతఃకలహము లున్నమాట నెరుగు
దును. మీరు వారందరును భారతమాతృగర్భమున జని
యించిన సహోదరులని మరచిపోవుచున్నారు."

"బాయిసాహెబ్! మీరు మహమ్మదీయుల మాట
మరచిపోయినట్లున్నారు. మొగలాయీప్రభుత్వాంతకాలమున

సిక్కుల మతగురువుల వారవ్యక్తముగ చిత్రవధ గావించినారన్న స్పర్థ సిక్కుల కడుపులో గార్చిచ్చువలె రగుల్కొనుచున్నది. వారుభయు లేకపక్షమున జేరి యేకవిశ్వాసముతో పోరాడుట కల్ల."

ఇట్లు రాణికిని లక్ష్మణరావునకును సంభాషణ నడచినది. ఎదుర్కొన వలసినది ప్రబల శత్రువు; తానొక చిన్న దుర్గమున కధికారిణి! తనలో మొలకెత్తిన విప్లవ బీజముల సమస్త భారతమున వెదవెట్టి పండించిన నెంతటి ప్రభుత్వమైన నేమి?

పీష్వా నానాసాహెబును నిక్లే దత్తపుత్రు డగుటవలన నతని తండ్రి పీష్వా బాజీరావునకు ప్రభుత్వ మిచ్చుచున్న యెనుబదివేల పౌనులు భరణము నాపుదలచేసినారు. అతడు నేడు బిథూరు సంస్థానములో కోరలు దీయ యత్నింప పసి బట్టిన కాలసర్పమువలె కాలమునకై వేచి సమయ మాసన్నమైనదని పగ సాధింప పూనినాడు.

నానాసాహెబు యావద్భారతమున విప్లవశక్తుల మేల్కొల్పి ప్రభుత్వ భవనముల దహింప బద్ధకంకణుడై శ్రమించుచున్నాడు. ఆంగ్లేయప్రభుత్వము నెదుర్కొనవలెనన్న కేవలము దేశీయుల విప్లవశక్తి చాలదని గమనించి మారువేషముల దేశీయ సైన్యములతో పరిచయము లేర్పరచుకొని వారిని విప్లవసన్నద్ధులం గావించినాడు. అతని సైన్యాధ్యక్షుడు తాతియాతోపీ పీష్వాయెడ నచంచల భక్తి విశ్వాసములతో యావద్భారతమును పర్యటించి స్వాతంత్ర్య సైన్యముల చేకూర్చుకొనుచున్నాడు.

దేశీయసైన్యమున విప్లవభావములు పొడగట్టనారంభించినవి. ముప్పదినాల్గవ దేశీయసైన్యము సింధులో నధికవేతన మిచ్చినగాని పోరాడ మనిన వెడలగొట్టి యాంగ్లేయసైన్యోద్యోగులు వారిని శిక్షించినారు. అరువదియారవ పటాలము పంజాబు యుద్ధరంగములో ప్రవేశించి పోరాడమని సంచలన మొనర్ప వారిని వెడలగొట్టినారు. ఆరకాట్ రంగమున బలవంతముగ వారిచే పోరాడించినారని దేశీయసైన్యములు విసిగినవి. వీరిలో స్వాతంత్ర్యకాంక్ష ప్రవేశించిన చాలును. భారతజాతికి విముక్తి యని నిశ్చయించి తాంతియా దేశీయసైన్యములతో బ్రసంగించి వారి సంసిద్ధతను చేకూర్చుకొని యాంగ్లపాలనము వలన క్షతి నొందిన సంస్థానములన్నిటికి వచ్చి వారిని పీష్వా సాగింపనున్న స్వాతంత్ర్యసమరమున సాయ మొనర్ప నర్థించుచున్నాడు.

మహావీరుడు తాంతియా ఝాన్సీకి వచ్చి రాణితో బ్రసంగించినాడు. "ఒక శతాబ్దకాలము మనము నిద్రపోయినాము. ఆంగ్లేయులు స్థానబలమును జిక్కించుకొని యినుపవలలు యావద్భారతమున పన్నినారు. దానిలో మనము మత్స్యములమై బయటపడ తన్నుకొనుచున్నాము. వ్యక్తిగతముగ మనమెన్ని యత్నము లొనర్చిన నవి నిష్ప్రయోజనములు. నేడీ తెరను దెంపవలెను. పీష్వాకు సాయపడ మిమ్ముల వేడుచున్నా"నని తాంతియా ఝాన్సీ దర్బారులో భవిష్యత్స్వాతంత్ర్య సమర సేనానాయకునివలె మేఘ గంభీరముగ బ్రసంగించినాడు.

దర్బారులో సరదారులు, ఖిలేదారులు, నుద్యోగులు, ఫిరంగీసైన్యనాయకుడు గుల్మహమ్మదు, సైన్యాధ్యక్షుడు ఖుదా

బక్షు నున్నారు. వారందరు విన ఝాన్సీరాణి ప్రసన్నగంభీర ముగ నిట్లు పలికినది.

"శత్రువులకు కాల మాసన్నమైనది. ఈ పరప్రభుత్వము నింకెంత కాలము మనము సహింపగలము? మన యాచార వ్యవహారములకు స్వస్తిచెప్పి, మన భావనాలోకముల విష పాషాణముల కలిపి, మన సౌభ్రాతృత్వమును ఛిన్నభిన్న మొనర్చి ప్రభుత్వము కళ్ళెముల పట్టుతప్పనీయక కాలము గడుపుచున్నారు. వీరమున ప్రపంచమున ప్రథమగణ్యమైన మన జాతి బానిసవృత్తి కలవాటుపడ ప్రారంభించినది. దీని నిక సహించుట కనకాశము లేదు. పీష్వాసాహెబ్ పూను కొనిన స్వాతంత్ర్యసమరమున విజయము మనకు లభింపగలదని నా దృఢవిశ్వాసము. ఝాన్సీ సమస్తము నావీరుని యడుగు జాడలలో నడువగలదని మీకు నేను వాగ్దానము జేయు చున్నా"నని రాణి ప్రసంగము చాలింప సభలో జయశబ్ద ములు చెలరేగినవి. ఈ మాటలు సత్యము లన్నట్లు ఝాన్సీ కోటలోని మహాదేవాలయ ఘంటిక మ్రోగినది. తాతియా రాణియెడ కృతజ్ఞతా వాక్యములు పలికిన తరువాత సభ ముగిసినది.

తాతియా దక్షిణదిక్కునకు వచ్చినపుడు నానా సాహెబు కాన్పూరు, లక్నో, సంబాల్‌పురము, మరికొన్ని స్వదేశసంస్థానములను మరల దర్శించి గూఢచారుల నియ మించి తిరిగివచ్చినాడు. స్వాతంత్ర్యసమర సన్నాహము లతి గూఢముగ సాగిపోవుచున్నవి.

గవర్నరుజనరల్ డల్‌హౌసీ యింటికి తిరిగి వెళ్ళినాడు. బ్రిటిష్‌ప్రభుత్వము కానింగ్ ప్రభువు నతని స్థానమున నియ

మించినది. ఆంగ్లేయులు డల్‌హౌసీ ఉపసిద్ధాంతము వలన కలిగిన రాజ్యలాభమునకు సంతసించుచున్నారేగాని, భారత దేశమున తత్ఫలితముగ కలిగిన మార్పుల గమనించుటలేదు. భయముతో వారిపాలన సాగుచున్నది. ప్రజలలో సమస్త వర్గములందు నసంతృప్తి బయలుదేరినది. దాని నేకముఖ మొనర్చుటకై ప్రథమస్వాతంత్ర్యవీరులు నానాసాహెబ్, తాంతియా, ఝాన్సీరాణీలు పూనుకొనినారు.

దేశమునం దెల్లెడ వృద్ధులు శివాజీ, సురాజుద్దౌలా, నానాఫడ్నవీస్, టిప్పుసుల్తానుల దేశభక్తిత్యాగములు, శక్తి సామర్థ్యము లింకను యువకలోకమునకు గథలుగ జెప్పి శౌర్యరసమున వీరగుణ ముగ్గుబాలతో రంగరించి పోయుచున్నారు. ఆంగ్లేయు లెన్ని యత్నములొనర్చినను దేశీయాచార ముల స్తంభము లించుకైన గదలలేదు. దేశీయవిద్యావిధానమున మార్పులేదు. తమ పూర్వచరిత్రను జ్ఞప్తిగొనుచున్నారు జాతిచరిత్రలో నెన్నిపుటలో వెనుకకు త్రిప్పవలసిన యుగత్య మానాటికి కలుగలేదు.

"త్వరలో మనయుద్ధ మారంభము కానున్నది. మీరును సిద్ధపడు"డని లక్ష్మీబాయికి చారునిముఖమున లేఖవచ్చినది. "నే నెన్నడును సంసిద్ధమే"నని యామె సమాధాన మంపినది.

లక్ష్మీబాయి తెల్లని 'పైజమా' తొడిగినది. 'అంగ రఖా' వేసినది. మయూరశ్యామలమైన కంచుక మొకటి పైన దొడిగినది. తలపై టోపీధరించి తెల్లని జరీకుచ్చుల తలపాగ జుట్టినది. నడుమునకు సరిగంచుల దుప్పటి బిగించి మోకాలు పొదిగిన కైజారందు నిలిపినది. పురుషవేషముతో శ్రీరాణిగా

మధిరోహించి ఝాన్సీ రాజ్యమునను బుందేల్ ఖండమునను గ్రామముల కేగి ప్రజాహృదయక్షేత్రముల ప్రభుత్వముపై విప్లవబీజముల నాటి పండించినది.

“అదిగో! పరప్రభుత్వము పటాపంచలు కానున్న దివ్య సమయ మాసన్నమగుచున్నది. లెండు! మేల్కొనుడు!! మీలో నిద్రించుచున్న సమస్తశక్తుల కేంద్రీకరించి పోరాటమునకు సంసిద్ధులు కండు. పూర్వవైరములకు నేడు తావు లేదు. సమయము తప్పినా మనకు బానిసతనము తప్పదు. నిత్యలక్ష్మీసుందరమైన దేశమున దారిద్ర్యదేవత కరాళ తాండవ మొనర్చును.

“బానిసవృత్తిలో బ్రతుకుటకంటె స్వచ్ఛంద జీవనమునకై చావుమేలు. *Wonderful Comment*

“ఈనాడు మనము జీవించునది మన పూర్వుల పునీత భారతమున కాదు. నరలోకమున ముందెన్నడును కని విని యెరుగని నరక కూపమున మన సంస్కారము జీర్ణించుచున్నది. ఎటు జూచిన దౌర్జన్యము! దురాగతము!! దాస్యము!!!

“ఆంగ్లేయ ప్రభుత్వమును శతవర్షములు సాగనిచ్చినాము. అయ్యో! మన మెంతటి యశక్తులము. శివాజీవంటి స్వేచ్ఛాప్రియుల రక్తనాళముల ప్రవహించిన మన జాతి రక్తమున నీనాడు వేడి చల్లారినదా? మనశక్తిసామర్థ్యములు, పౌరుష పరాక్రమములు గంగలో కలసినవా?

“పీష్వానానాసాహెబ్ నాయకత్వమున స్వాతంత్ర్యసమర మారంభమైనది. ఆ తల్లి సేనలో మీరును పాల్గొనుడు.

మీవీరమును లోకవిఖ్యాత మొనర్చుకొనుడు. మీ సమస్త
మును ధారపోయుడు. స్వేచ్ఛను నిలువబెట్టుకొనుడు.

"ఈ పిలుపు వినరా! ఇక మిమ్ము పిలుచువా రుండరు. పిలిచినను మున్ముందు శ్మశానవాటిక జేరిన శవములవలె బలుకలేరు" అని ప్రణయానురాగములో, బరమ వీరములో, 'నసూర్యంపశ్య' యైన రాణీసాహెబ్ గ్రీష్మవేళల గ్రామ గ్రామముల పర్యటన మొనర్చి నిద్రాహారము లెరుగక, భారత స్వేచ్ఛా శంఖారావ మొనర్చుచు విజయయాత్ర యొనర్చి, తిరిగి ఝాన్సీదుర్గమును చేరుకొనినది.

బుందేల్ ఖండము సమస్తమును మేల్కొన్నది. రాణి నడచిన నీడల ననుసరించుటకు ప్రజ ప్రమాణముల స్వీకరించినది. వర్తకులు కావలసిన ధనసహాయ మొనర్చుటకు నిశ్చయించినారు. వారాంగ్లేయవర్తకుల చేతులలో యమ యాతనలు పడుచున్నారు; బలవంతపెట్టి ప్రభుత్వసహాయము తో జెప్పినంతకు వస్తువుల కొనిపించుచున్నారు. రాణి యాజ్ఞ ననుసరించి శత్రువుల కాహారపదార్థములు లభించు నన్న భయముతో గృషీవలులు పైరుల బండింపక భూముల నూసరక్షేత్రముల గావించినారు. కొన్నివత్సరములకు గావలసిన యాహారపదార్థముల దుర్గమునందు భద్రపరచినారు. స్వచ్ఛందముగ సైన్యమున జేరి శిక్షణ పొందుచున్నారు. స్త్రీలు కందకములలో నిలచి సైన్యమునకు సహాయమొనర్ప ప్రతినలు గైకొనినారు.

నానాసాహెబ్ ఢిల్లీ, కాన్పూరు, లక్నో, ఆగ్రాల మధ్య తోకచుక్కవలె తిరుగుచున్నాడు. ఔధ్ లో ప్రచార మొనర్చు సందర్భమున కొంత ప్రథమమున వ్యతిరేకత పొడకట్టి

సమసిపోయినది. అతని చాయ లనేకరీతుల యావద్భారతమున వ్యవహరించుచున్నారు.

నైజాములో గదలిక కలుగలేదు. 1800 లో నాంగ్లేయులతో నత డొక సంధి చేసుకొనినాడు. దానిననుసరించి వారి కతడు సైన్యసహాయ మొనర్పక తప్పదని పలికినాడు. కాని యతని దేశములో సంచలనము కలిగినది. గ్వాలియర్ ప్రభువు దేశద్రోహమునకే నిశ్చయించినాడు. కొలదికాలము క్రిందట జరిగిన నేపాలయుద్ధములో నాంగ్లేయులకు ఔధ్ రాజు నవాబువజీరు సమస్త సహాయము మొనర్చి గెలిపించినా డన్న క్రోధముతో వారిని నుసుమాడవలె ననుకోరికతో పఠానులు కాచుకొని కూర్చొనినారు. మహమ్మదీయుల శిక్షింప సిక్కులు సర్వదా సంసిద్ధులుగ నున్నారు. ఆంగ్లేయులు 'విడదీసి పాలించుట'లో గడు నేర్పరులు.

ఒక దినమున ఝాన్సీరాణికి నానాసాహెబ్ స్వహస్తముతో నున్న లేఖ వచ్చినది. అందు—

“మన యత్నములెల్ల ఫలించుచున్నవి. వారి తంత్రములు కూలుచున్నవి. నామమాత్రావశిష్టుడుగ నుగ్రతతో వృద్ధాప్యముతో కాటికి గాళ్లుచాచుకొని కూర్చొనిన మొగలాయీ చక్రవర్తి బహదూర్ షా కాశాజ్యోతి గల్పింపగలిగినాము. పర్షియారాజు హీరట్ వరకు దండెత్తి వచ్చినట్లు ఢిల్లీలో వార్తలు ప్రబలుచున్నవి. ఆంగ్లేయ సైన్యముల దరిమివేయ కృతనిశ్చయుడై యతడు భారతదేశమునకు సైన్యమంపుచున్నాడు. మహమ్మదీయు లందరు నందు జేర సంసిద్ధులు కావలసిన దని మషీ పంకములతో నేను వ్రాయించిన లేఖను

ములు వారిలో సంచలనము గలిగించినవి. మౌల్వీ వేషము లతో దర్గాలలో ప్రవేశించి నానమ్మినబంట్లు జాగరూకతతో విప్లవదూతలుగ వ్యవహరించుచున్నారు.

"దేశీయసైన్యములలో మనముకలిగించినసంచలనము కారణముగ నిశీధివేళల సభలు జరుగుచున్నవి. గుసగుసలు సాగుచున్నవి. మౌల్వీ వేషముతో నేను ఫైజాబాదు, ఢిల్లీ, మీరట్, పాట్నా, కలకత్తాల పర్యటించుచున్నాను. పోగులు పోగులుగ నున్న విప్లవమును గలిపి దారమల్లు చున్నాను.

"మన సమరము రాజపుత్రస్థానమున నారంభము కానున్నది. జైపూరు, జోధపూర్, బికనీర్ మొదలైన ప్రముఖులు, దుర్గాధీశ్వరులు రాబోవు సమరమున తటస్థులుగ నుండుట కంగీకరించినారు.

"కాని యీ ప్రాంతమున స్వాతంత్ర్య సేనల నడిపింప సమర్థుడగు నాయకుడెవ్వడును గనిపించుట లేదు. మీ ప్రయత్నముల నప్రమత్తులుగ నుండు" డని యున్నది.

1857 మార్చిలో దేశీయసైన్యమున జనించిన కలకలముతో స్వాతంత్ర్యసమర మారంభమైనది. ఆంగ్లేయులు పందొమ్మిదవ కాల్బలము బారక్‌పూరులో తిరుగుబాటు చేసినది. అందు నిగ్గుదేరిన సిపాయీలను సైన్యములనుండి వెడలగొట్టినారు. వారు నానాసాహెబ్ సైన్యమున చేరినారు. వెనువెంటనే అంబాలా, కాన్పూరు, లక్నోలలో విప్లవ మారంభమైనది. మీరట్‌లో నాంగ్లేయుల మూడవ యాశ్వికదళము; పదకొండు, నిరువదవ పటాలములు విప్లవ మొనర్చి

జాతీయ స్వేచ్ఛాసైన్యమును గలిసికొనినవి. మే నెల 11 న నాంగ్లేయ కమీషనరును బలిచేసి, 'యాంగ్లేయ ప్రభుత్వ మంతరించిన'దని విజయనాదము లొనర్చుచునానాసాహెబును కొందరు సైనికులు గలిసికొనినారు. ఇట్లనేక సైన్యములు తిరుగుబాటుచేసి స్వచ్ఛందసేనలతో జేరినవి.

ఆంగ్లేయులతో విప్లవవీరు లనేకయుద్ధము లొనర్చినారు. నానాసాహెబు మహారాజపురము, కాన్పూరు, బిఠూరులలో వారి నెదుర్కొని బలము చాలనందున తిరోగమించినారు. మహమ్మదీయులు బహదూర్‌సాను చక్రవర్తిని గావించి ప్రమత్తులై యున్నసందర్భమున హాడ్సన్ సేనానాయకుడు వారిపై కెత్తివచ్చి యతనిని బందీ గావించి నిర్వంశ మొనర్చినాడు.

అనుక్షణమును పెరిగిపోవుచున్న నానాశక్తి కాంగ్లేయులు వెఱగుపడినారు. తమ సర్వస్వము నొడ్డి సంరక్షించుకొన నిశ్చయించి బ్రిటిష్ ప్రభుత్వమున కాంగ్లేయులు మొర పెట్టినారు. 17 ఆగస్టు 1857 న భారత స్వాతంత్ర్య యుద్ధ వీరుల నెదుర్కొను కాలిన్ కాంబెల్‌ను సర్వసేనాపతిగ నియమించి యతని యాజ్ఞానుసారముగ వర్తింప నా ప్రభుత్వము సేనలకాజ్ఞ నొసగినది. సమస్త భారతమున నున్న సైన్యముల వారు జేసూచ్చుకొనినారు. ఆంగ్లదేశమునుండి నూతన సేనల రప్పించినారు.

బహుకాలము సమరములు సాగినవి. 15 మార్చి 1858 న లక్నోలో మహాభయంకర యుద్ధము జరిగినది. నానా సేనలు, బేగమ్ నవాబు వజీరు సేనలు శత్రువు నెదుర్కొని ధైర్య సాహసములతో బోరాడినవి. కాని చివరకు గోమతీ నదీ

మార్గమున తిరోగమింప వలసి వచ్చినది. శత్రువులు వారిని వెన్నాడ నారంభించినారు. అరణ్యములలో నష్టకష్టముల నోర్చి పోరాడుచు తుద కవి నేపాళమును ప్రవేశించినవి. ఆనాటినుండి నానాసాహెబ్ ఏమైనదియును తెలియదు.

తాంతియా కొంతసైన్యముతో యమునానదిని దాటి స్వాతంత్ర్యసమరమున పాలుగొనుట నిరాకరించిన చర్ఖారీ రాజుపై బడి యతనిని శిక్షించినాడు. అందువలన నతనికి బదు నైదు ఫిరంగులు, మూడులక్షల రూప్యములు లభించినవి. శరణు జొచ్చిన యారాజు కొంత సైన్యసహాయ మొసగుట కంగీకరించినాడు. నేడు శత్రువులపై స్వాతంత్ర్య సమరము సాగించు వీరులకు ముఖ్యస్థానము కాల్పీ.

నానాసాహెబు వార్తలు తెలియకపోవుటవలన, సర్వ సేనాపతి తాంతియా శ్రీమంతుని పీష్వా నొనర్చి సమర మొనర్ప సిద్ధముగ నాంగ్లేయుల రాకకై వేచియున్నారు.

సంయుక్తప్రాంతముల యుద్ధము కాలిన్ కాంబెల్ నడిపించుటకును, మధ్యభారతమున సర్ హ్యూరోజ్ నడిపించుటకును నిశ్చితమైనది. రోజ్ యుద్ధనీతి విశారదుడు. ముందు ఝాన్సీని స్వవశమొనర్చుకొని కాల్పీ పై బడ నిశ్చయించినాడు. శత్రువులు ముందు కాల్పీలో యుద్ధ మొనర్చి తనపై బడుదురని రాణి తలపోసి కొంతసైన్యమును తాంతియాకు సహాయార్థ మంపినది.

ఇట్టి స్థితిలో శత్రువులు మహోదయమునాటి సముద్రపు కెరటములవలె పొంగి పొరలివచ్చి ఝాన్సీ నలుదెసల ముట్టడించిరి. రాణి యందుకు సిద్ధపడినది. మోరోపంతు,

గుల్ మహమ్మదు, ఖుదాబక్ష్ మరియు నితర ప్రముఖ సర దారులను దుర్గరక్షణకై నిలిపినది. సుబేదారులు బురుజులపై జాగరూకతతో ప్రవర్తించుచున్నారు. దుర్గభిత్తికలపై దూసిన కరవాలములతో, ముద్గర, పరశు, పాశాది సాధనములతో వారప్రమత్తులై యున్నారు.

శత్రుసైన్యములలో రణఘోషలు మారోగ్మ్రోగినవి. ఫిరంగులు ప్రేల్చ మొదలు పెట్టినారు. రాణీ దుర్గమునుండి ధ్వనికి ప్రతిధ్వనిగ ఫిరంగులు మ్రోయుచున్నవి. ఆమె ఫిరంగు లలో విఖ్యాతిగన్న 'శత్రు సంహారము', 'నలబారము', 'ఘన గర్జ' 'అగ్నివృష్టులు' కురియుచున్నవి. ఆరుదినము లట్లు గడచి నవి. శత్రువు తలచినట్లు రాణికి ఫిరంగిసామాగ్రి పూర్తి కాలేదు. తన కై పోవునన్న భయముతో నాంగ్లేయ సేనాధి పతి 'రోజ్' ఫిరంగియుద్ధము మానినాడు. బహుయుద్ధములలో నలిగిన సైన్యమునకు గొంత విశ్రాంతి చేకూరిన దను ధైర్య ముతో కోట కైగ ప్రాక నాజ్ఞాపించినాడు.

దుర్గమూలమునకు వారు చేరుకొనిన వెంటనే రాణి సైన్యము శిలావృష్టులు కురిపించినారు. ఆ దిశను ప్రయోజ నము లేదని మరియొక దిక్కున లగ్గల తగిలించి కోటగోడల పై కేగ యత్న మారంభమైనది. తుములయుద్ధములు ప్రారం భించినవి. రాణి పంపినవార్త కాల్పి చేరినదో! లేదో! ఆమె సైన్యములు రాలేదు. ఆహారమును గైకొనుటకైన నామె సైన్యములకు శత్రువు లవకాశ మిచ్చుటలేదు.

రాణీసాహెబ్ మందహాసములతో, మహోద్రేక ప్రసం గములతో దుర్గము నలుదెసల దానేస్వయముగ యుద్ధము సాగించు చున్నది. ఉభయపక్షముల నష్టములు విశేషముగ నున్నవి.

ప్రమాదము లోకదాని వెనుక నొకటి రాణికి సంభ వించుచున్నవి.

ఆమె యొకవంకకు మరల మరల చూచుటలో నభి ప్రాయ మేమి? ఆ దిక్కున నేమున్నది? అదుగో, తాంతియా! స్వారాజ్యసమర సేనానాయకుడు మొదలు కాకలు తీరిన కదనయోధుడు; దూరముగ బేత్వానది కానలగట్టున బహు బలముతో గనుపించుచున్నాడు. లక్ష్మీబాయి ముఖమున సంతోష రేఖలు నర్తించుచున్నవి.

ఆంగ్లేయ సైన్యాధ్యక్షుడు తాంతియా సైన్యమును గమ నించినాడు. అతనిపై యుద్ధమొనర్చుటకు సైన్యము వ్యతిరే కించుచున్నది. పూర్వ మతని చేతిలో నది దెబ్బలు తినినది. అతడు ధైర్యశాలి, నిరుత్సాహ మెరుగని వ్యక్తి. కేవల మాం గ్లేయ పటాలముల ముందుకు రప్పించి వారి నుద్దేశించి "ప్రపంచ యుద్ధరంగముల నెన్నిటినో ఖ్యాతిగడించిన బ్రిటిష్ సైన్యమునకు నేడీ కుయుద్ధమున పేరు ప్రతిష్ఠలు మంటగలియు నున్నవి. ఏ మహత్తర సామ్రాజ్యమునకై మన పూర్వులు ప్రాణముల బలికావించినారో, రక్తనదము లింకించినారో, దానిని నిల్పిన ఖ్యాతి మీకు దక్కనున్న"దని యుద్బోధించి నాడు. మరణమో, యశమో యని సాహసించి సమస్త సైన్యము నతడు తాంతియా కెదురు నడపించినాడు.

ఝాన్సీరాణి దీనిని గమనించి దుర్గద్వారముల దెర పించి వెనుకనుండి వారిపై బడ నిశ్చయించి కొన్ని పటాలముల గదిలించునంతలో ఫిరంగిసైన్యము శత్రుపక్షమునుండి యగ్ని పిండముల గురిపింప నారంభించినది. ఆమె సైన్యమునకు దిగి వచ్చుట కవకాశము లేకపోయినది.

తాంతియా సైన్యములో నర్ధభాగము బేత్వానది దాటి నది. మిగిలిన యర్ధభాగము దాటవలసి యున్నది. అట్టిస్థితిలో రోజ్ సైన్యములు వారి నెదుర్కొనినవి. అతని సైన్యములు తికమక పడసాగినవి. మరుక్షణముననే ధైర్యస్థైర్యము లతో నెదుర్కొనినవి. అందు రాణి శిక్షణమిప్పించిన ఝాన్సీ సైన్యముతో నాంగ్లేయ యోధులు, నాశ్వికదళములు తలపడినారు. శత్రుసైన్యమున ననేకులు మృతినొందినారు.

'రోజ్' దేశీయసైన్యమును ముందుకు బంపినాడు. ఆ యిరువదియైదవ పటాలము నేపాలదేశ సైన్యము. అది హిమవత్పర్వత శ్రేణుల పాదప్రదేశమున ప్రభవించిన గూర్ఖాజాతులతో నిండినది. ఇంతలో కర్నల్ నేపియర్ నూతనసేనలతో వచ్చి యాంగ్లేయుల గలసికొనినాడు. యుద్ధము మహాభయంకరముగ కొలదికాలము సాగినది. పరిస్థితస్థితిలో నేను ఝాన్సీ కెట్టిసాయము చేయలే నను నిశ్చయముతో తాంతియా తిరిగి కాల్పీవైపునకు వెడలిపోయి నాడు. ఆంగ్లేయసైన్యములో నొక పటాలమును దరుము కొనుచు వచ్చిన కాల్పీసైన్యము ఝాన్సీదుర్గములో ప్రవే శించినది.

ఝాన్సీ రాజ్యమున శత్రువుల కాహారపదార్థములు లభించుట లేదు. తాంతియా సైన్య తిరోగమనముతో వారికి కావలసినంత పదార్థము లభించినది. మరల ఝాన్సీ ముట్టడికి బూనుకొనినారు. సన్నాహముల సిద్ధమొనర్చుకొనుచున్నారు.

ఝాన్సీరాణిచిత్తము ప్రథమమున నించుక చలించి నది. దైవము తన కనుకూలముగ లేదని తలపోసినది. మరు క్షణముననే ధైర్య మవలంబించి దుర్గరక్షణోద్యోగమున

మానసమును సుస్థిరమొనర్చుకొనినది; సైన్యముల హెచ్చరించినది. సరదారులకు, ఖిలేదారులకు నావశ్యకములైన యనుజ్ఞల నొసగినది. సైన్యము నుద్దేశించి యుద్బోధక వాక్యముల బలికినది.

"మిత్రబలము మనకు సాయమొనర్చునన్న యాశ తీరినది. నేడు మనము స్వశక్తిపై నాధారపడవలెను. మరణమునకు మనము సంసిద్ధులమైననాడే భవిష్యత్తున బ్రతుకున్నది. మీహృదయకుహరములలో నూతనాశాజ్యోతులు వెలిగింపుడు. మన పూర్వీకుల స్మృతిపథముల నిల్పుడు. పోరాడుడు. మిమ్ము రక్షించుకొనుడు. స్వదేశమును, స్వజాతిని, స్వధర్మమును రక్షింపు" డనిన యామె వీరోచిత వాక్యములకు సైనికులు జయజయ ధ్వానము లొనర్చిరి. మిన్నులు మారుమ్రోగ వీరారావము లొనర్చిరి. దుర్గములోని హర్షోద్వేగ నినాదములతో శత్రుహృదయములు దద్దరిల్లుచున్నవి.

3 ఏప్రియలు 1858 ఉదయారంభమునుండి యాంగ్లేయులు ఝాన్సీపై ముట్టడి నారంభించినారు. ముఖద్వారముపై ఫిరంగిసైన్య మగ్నివృష్టి గురిపించుచున్నది. ఝాన్సీదుర్గమునుండి "మారో ఫిరంగీకో" అని గుల్మహమ్మద్ ప్రచండ కంఠస్వరము వినిపించినది. మరుక్షణమున శత్రుసేనపై నొక యగ్నికెరటము పయనించి వారిని జెల్లాచెద రొనర్చినది. అనతికాలములో వారు మరల తేరుకొని మృత్యువును తిరస్కరించుచు ముందుకు సాగివచ్చినారు.

ఆంగ్లేయులు కోటగోడ లెగబ్రాకుటలో సుశిక్షితులు. అందు జాను, మైకేల్, డిక్, ఫాక్సులు అందెవేసిన చేతులు.

ఝాన్సీరాణి సైన్యప్రధానులలో నొకడైన రఘునాథసింగు నిలచిన బురుజును బట్టుకొను యత్నములో గోడలపై నిచ్చెన గొలుసుల వేసి వారు ఎక్కి-వచ్చుచున్నారు.

దుర్గ మేటవాలైన గిరిశిఖరిపై నుండుట ఝాన్సీరాణి కుపకరించినది. వారి నామె సైన్యము ఖడ్గములతో నెదు ర్కొని రూపుమాపినది. ఇట్టి యత్నములు నిష్ప్రయోజనము లని వారు మరొకవైపునకు వెడలినారు. ఇంతలో కోట లోపలినుండి 'హరహర! మహాదేవ!!' యను నార్తనాద ములు రాణి చెవులబడినవి. లంచమిచ్చి మోసముతో నాంగ్లే యులు దక్షిణదుర్గద్వారమును బట్టుకొని ప్రవేశించి తుముల ఘుద్ధము లొనర్చుచు ప్రజల చిత్రవధ జేయుచున్నారు. భయ కంపిత గాత్రులై ప్రజలు నలుదెసల పరుగిడుచున్నారు.

'ఇక మృత్యువు తప్పదు' అని ఝాన్సి నిశ్చయ మొనర్చి నది. కాళీమూర్తివలె నాకృష్ట కృపాణముతో నశ్వమును నలుదెసల బర్వులెత్తించు చున్నది. ప్రజల చిత్రవధ కన్నుల బడినది. ఆమె కన్ను లెఱ్ఱవారినవి. ఆమె యున్మత్తురాలైనది.

సంకులసమర మారంభమైనది. ఖడ్గయుద్ధము భయం కరముగ సాగుచున్నది. హాహారావములు, సైన్యనిర్ఘోషలు, కరాళాట్టహాసములు, దుర్గరణారావములు తమలో దాము పోరాడుకొను చున్నవి. ప్రధానద్వారము శత్రువుల వశమై నది. బురుజుల గాపాడు మంత్రులు కొందరు మరణించినారు. మోసపంతు మొండెము తనముందు నడచి నేలపై దొరలు చున్నది.

ఝాన్సీరాణి శరీరము రక్తసిక్తమైనది. ఖడ్గము కఱకు వారినది. శత్రువులు నలుదెసల మూగి ముందుకు సాగి

వచ్చుచున్నారు. ఆలస్యమైన నష్టకష్టములపాలు గావించిన యీ మహావీరమూర్తికి వారేమి యుపాయ మొనర్తురో!

అశ్వమధిరోహించి గుల్మహమ్మద్, ఖుదాబక్షులు వచ్చి యెదుట నిలచినారు.

"రాణిసాహెబ్! దుర్గమును శత్రువులకు స్వాధీన మొనర్చుట యుక్తము."

"ఝాన్సీనా! నాకౌస్తుభమును! శత్రువుల హస్తముల కందించుటా! బొందిప్రాణ మున్నంతవరకును జరుగదు." రాణి యున్మత్తురాలివలె ననినది.

"మీరు పీష్వాసైన్యములకలుసుకొని మరలస్వాతంత్ర్య సమరమును సాగింపవచ్చును గదా? మీ ఝాన్సీ మీకు దక్కవలెనన్న..."

"ఔను. పీష్వాసైన్యముల చేరుకొనుటయే మన కర్తవ్యము." రాణి నిశ్చయమున కాసైన్యాధిపతు లిరువురును సంతసించినారు. రాణి కంగరక్షకులుగ పదునైదుగు రాశ్వికుల దీసుకొని నిశీధవేళ వారుత్తరద్వారమును ప్రవేశించినారు.

గవని కాపలాదా రడ్డుపడి ప్రశ్నింపగా నతనికి, "మేము టెహ్రీ సంస్థానాధీశ్వరు డాంగ్లేయులకు హారణమిచ్చిన సైనికులము. సర్ హ్యూ రాస్ యాజ్ఞానుసారముగ సైన్యగణ కేగుచున్నా"మని మోసగించి దుర్గమునుండి బయటపడినారు.

రాణి బేత్వానదిని దాటి యగాధమార్గమున నిశీధమందు కాల్పిమార్గములో నడచుచున్నది. వెన్నుపై దత్త

పుత్రుని దామోదరుని పట్టు సెల్లాలో గట్టుకొనినది. ఒకచేత నశ్వపల్యాణములు, మరియొకచేత నుద్ధృతఖడ్గము నున్నవి. పదునై దశ్వములును నొక శలాకవలె వెంట నడుచుచున్నవి. ఒకప్రక్క గుల్మహమ్మద్, మరొకవంక ఖుదాబక్ష్, మధ్యన రాణి పయనించుచున్నారు.

రాణి దుర్గమును వదలి కాల్పీ పోవుచున్న దన్న వార్త సరదారులకు తెలిసినది. వారును సైన్యముల మరలించి రాణి వెనువెంట బయనమైనారు. ఆంగ్లేయులు సమస్తమును దెలుసుకొనినారు. లెఫ్టినెంటు బొకర్ రాణిని కాలవిలంబన మొనర్పక వెన్నాడ నారంభించినాడు. ఇరువుర సైన్యమునకు గనుజూపుమేర దూరము లేదు. మరునటి దిన ముదయవేళకు రాణీ కాల్పీ గాచబాటకు చేరినది. వెనుకవచ్చు రాణీ సరదారులు బొకరుతో దలపడి యతనిని సైన్యసమేతముగ యమపురి కంపినారు.

కొంత సైన్యముతో, సరదారులతో, రాణి కాల్పీ జేరినది. ముట్టడి ప్రారంభమైనది మొదలు లామె నిద్రాహారము లెరుగదు. నేడు కొంత స్వస్థత చిక్కినది. ఉషోదయవేళ వరకును నిద్రించి మేల్కొనినది. తాతియా మరికొన్ని విప్లవ సేనల కూర్చుకొని శత్రువులతో సమర మొనర్ప సన్నద్ధపడినాడు. ఝాన్సీరాణీరాక యతనికినూతన చైతన్యమును గల్పించినది.

ఇరువురును స్వాతంత్ర్య సమరమును ఆ మరణాంతము సాగింప పునఃప్రమాణములొనర్చినారు. కొంత సైన్యమునకు తాతియానాయకత్వము వహించినాడు. మరికొంత సైన్యమును ఝాన్సీరాణి నడుపుట కంగీకరించినది. పీష్వా ప్రతినిధి శ్రీమంతు మరికొంత సైన్యమును పాలించుటకు బూనుకొనినాడు.

కాల్పీనుండి నలుబది మైళ్ళు ముందుకువచ్చి 'కుంచి' యొద్ద సైన్యములు నిలచినవి.

లక్ష్మీబాయి సైన్యము బందానవాబు, సాగరమహా రాజు, వనపుర రాజులు పంపినది. వారు క్రమశిక్షణ నొందిన వారు కారు. కేవల ముత్సాహులు. ఆసైన్యనిర్మాణము రాణికి నచ్చలేదు. కాని వారిని నడిపింపక తప్పదు. శత్రుసేనల క్రమ శిక్షణ మత్యున్నతమైనది. సాధనసామగ్రిలో వా రధికులు. అందు జనరల్ 'రాస్' యాజ్ఞ కెట్టి యాటంకమును లేదు.

అట్టి గ్రీష్మసమయమును బ్రజ మున్నెన్నడును గని విని యెరుగరు. ఆంగ్లేయసైన్యము లా వేసగిని భరింపలే వని రాణి గమనించినది. ఫిరంగియుద్ధము పగలు పన్నెండుగంటలు దాటినతరువాత ప్రారంభ మొనర్పవలె నని శాసించినది.

యుద్ధ మారంభ మైనది. ఆంగ్లేయుల పక్షమున నూతన సేనానాయకు లనేకులు యుద్ధ మొనర్చుచున్నారు. స్వాతంత్ర్య సైన్యము శక్తికొలది పోరాడినది. వ్యక్తిగతములైన ధైర్యో త్సాహ క్రియ లనేకములు సైనికులు ప్రకటించినారు. ప్రయో జనము లేకపోయినది. 7 మే 1858వ కుంచియుద్ధ జాతీయసైన్య మునకు మరల నొక యపజయము!

సమరము సాగుచున్న సమయమున తాతియా కొంత సైన్యముతో నదృశ్యుడైనాడు. తిరోగమించుటలో రాణీ నాయకత్వమున స్వాతంత్ర్యసైన్యము ప్రకటించిన ధైర్య సాహసములను శత్రువులు వేనోళ్ళ పొగడినారు. రెండు మూడు మైళ్ళవరకును తుములయుద్ధములు సాగించినారు. వారి ధైర్యము వీగిపోవుట లేదు; చెదరుట లేదు. విప్లవసైన్యములో

నాశ్వికబలము కాల్బలమును, కాల్బలమాశ్వికమును నిందించు కొనుట కారంభించినారు. కొందరు ఝాన్సీని నిందించినారు. మరికొందరు బందా నవాబును నిందించినారు.

రాణి ముందునకు వచ్చి కాల్పిమైదానములో సమస్త సేనల నుద్దేశించి "మహాయోధులారా! ఒకరినొకరు నిందించుట కిది సమయము కాదు. మన సర్వస్వము వినాశమునొందుచున్న సమయమున నీ యనైకమత్యమునకు చావీయకుడు. తాత్కాలికముగ దిగోగమించినాము – మరల శత్రువుపై బడక తప్పదు." అని వారిని రాణి యాశ్వాసించినది.

మే 22 న ఝాన్సీరాణి సమస్తసేనలతో యమునానదిగొడ్డున నిలచి నూతనోత్సాహమును రగిల్చినది.

"సైనికులారా! అదుగో యమునామాయి! ఆ పవిత్రనీరముల గ్రహించి మాతృదేశముకొఱకు, స్వధర్మము కొఱకు, మాసర్వస్వముల బలిగావించుటకు సంసిద్ధుల మని ప్రమాణమొనర్పు" డని శాసించినది. ఆమె యాజ్ఞానుసారముగ విప్లవసైన్యములు ముమ్మారు ప్రమాణ మొనర్చినారు. వారి వీర శంఖధ్వానములకు యమునా కాళిందీ నదులు ప్రతిశబ్దించుచున్నవి.

ఆశ్వికచమూఘాటికి రేగిన కెంధూళుల నక్షాలాస్త్రమయములు పొడకట్టుచున్నవి. దానిని దిలకించిన శత్రువృలకు గుండెలు చెదురుచున్నవి.

జనరల్ రాస్‌కు సహాయార్థము సర్వసైన్యాధ్యక్షుడు కాలిన్ ఓక్ సేనానాయకుని బంపినాడు. ఆత డసాధ్యాన్యయోధుడు. బర్మా, నేపాళ యుద్ధములలో ప్రాభవము ప్రఖ్యాతి

గడించి ఖ్యాతిగన్నవాడు. ఆంగ్లేయసైన్యము కాల్పీస్థైదాన మ్ముల విడిసినది. ఎవరును ముందునకు వచ్చుటకు సాహసింప లేదు.

ఎంత కాల మిట్లు? రాణి యానా డాశ్వికసైన్యమును నడుపుచున్నది. తన యాశ్వికసైన్యమును ముందుకు దూకించినది. పదునైదు నిమిషములకాలము శత్రువు లనిశ్చితులుగ నున్న వారి సేన సమస్తమును యమదర్శనమున కేగియుండెడిది. 'ఓగ్' తన వెంట నూతనముగ తెచ్చిన యుష్ట్రబలమును ముందునకు గదలించినాడు. దానితో స్వాతంత్ర్యసైన్యమున గల్లోలము చెలరేగినది. మునుపు వా రట్టి యుష్ట్రబలమును జూడలేదు. ఇదే సమయమని యాంగ్లేయులు సమస్తబలముల దరలింప నుభయపక్షములకు ఘోరయుద్ధము జరిగినది.

స్వసైన్యమున నీతి తరిగిపోవుచున్నది. శత్రువులు మహోత్సాహముతో బోరాడుచున్నారు. సమస్తవాహినిని హత మొనర్చుకొన్న నిక యాశ్కైన తావుండదు. మరల నొకరంగమున నెదుర్కొన యూహించి రాణి సైన్యమును మరియొక మార్గమును బట్టించి నడిపించినది.

శత్రువుల యదృష్టము పండినది. కాల్పీ వశమైనది. నానాసాహెబు, తాతియాలు శ్రమపడి సంపాదించిన యాహార పదార్థములు వారి వశమైనవి. భూగర్భముల దాచియుంచిన యిరువదివేల పౌనుల మందుసామాను చిక్కినది. విజయోత్సాహముతో దన సైన్యముల కిట్లు జనరల్ రాస్ పలికినాడు.

"సైనికులారా! మీరు వేయిమైళ్ళు జయించినారు. మనకు నేటికి నూరు ఫిరంగులు చిక్కినవి. నదుల నీదినారు, వనముల గడచినారు, పర్వతశ్రేణు లెగబ్రాకినారు, మహో

సైన్యముల నుపయోగించినారు. మీ క్రమశిక్షణ ఫలితముగ నర్మద మొదలు యమున వరకునున్న స్వర్ణఖండము మనకు వశమైనది. మన సైన్యచరిత్రలో మీ వీరోచిత కృత్యములు సువర్ణాక్షరముల లిఖితములు కాగలవు. మీ పరిశ్రమకు తగిన ప్రతిఫలము బహుమాన రూపమున ననతి కాలముననే పొందగలరు."

సైన్యముల కభినందన వాక్యములు పలికి యారోగ్యమును జేకూర్చుకొనుటకై జనరల్ రాస్ బొంబాయికి బయలుదేరినాడు. కాని ఝాన్సీరాణి యతని కట్టి యవకాశము నొసగ నిచ్ఛగించలేదు.

కాల్పి శత్రువులకు వశమైన తరువాత విప్లవ సైన్యములకు నిలువ నీడలేదు. ఆహారపదార్థములు లేవు. నానా సాహెబ్ వార్తలు వినిపించుట లేదు. తాంతియా యెట నదృశ్యుడైనాడో తెలియదు. గోపాలపురమును జేరుకొని సైన్యములు కర్తవ్య మాలోచింపసాగిరి.

"అపజయములపై నపజయములు. ఇక్కెంతకాలము!" అని బండా నవాబు పలికినాడు.

"మాతృదేశమునకు ముక్తి యికలే" దని సాగర మహారాజు జపించినాడు.

ఆమాట చెవిని బడిన మరుక్షణమే ఝాన్సీరాణి కొదమ సింగమువలె "నాకుతుకలో ప్రాణ మున్నంతవరకట్టి యూహాలు రాకూడ" దని గద్దించి పలికినది.

"ఇప్పటిలో తాంతియా యున్న నెంత బాగుండెడిది!"

"తాంతియా యేమైనాడు?"

"తండ్రిని చూచుటకు చర్కీకి వెడలి యుండవచ్చును."

"ఇది నేను నమ్మలేను. అత డచంచల దేశభక్తుడు. మాతృసేవలో మహత్తరకార్యదీక్షితో సైన్యములు వ్యవహరించుచున్న యీ సమయమున దా స్వార్థత్యాగి తండ్రిని దర్శింప నేగునా? ఇది కల్ల! అత డట్టి తుచ్ఛుడు కాడు." అని రాణీసాహెబు పలికినది.

కాల్పీ యుద్ధరంగమునుండి గ్వాలియర్ మార్గమున తాంతియా యా మహానగరము చేరుకొనినాడు. గ్వాలియర్ మహారాజు శత్రువులకు మిత్రుడు. నేటి స్థితిలో గ్వాలియర్ వంటి దుర్గము చేతనున్నగాని యాంగ్లేయులతో సమరము సాగించుట కవకాశము లేదు. తాంతియా గ్వాలియర్ చేరు కొనిన మరుక్షణమునుండి సైనికోద్యోగులలోను, రాజోద్యోగులలోను విప్లవబీజముల వెదజల్లినాడు. మహారాజును మోసగించియైన గ్వాలియర్ కోటను తాంతియావశము గావించి స్వాతంత్ర్యసమరము సాగింప సాయపడుటకు వారు ప్రమాణము లొనర్చినారు. ఈ రాచకార్యమున కొక మాసము కాలము పట్టినది. ఈ మహత్తర రాజకార్యమునకే యతడు కాల్పీ యుద్ధరంగమునుండి యదృశ్యుడైనాడు.

స్వాతంత్ర్యయోధులకు గ్వాలియర్ తుది సమరాంగణము. దానిని స్వీకరించుటలో మొదట గ్వాలియర్ బాలెఘాట్ దళముతో లక్ష్మీబాయి పోరాడవలసివచ్చినది. పోరాటమున నోడిపోయినను సింధియా మహారాజు వారికి సాయపడ నిచ్ఛగింపక నాంగ్లేయ సహాయ మర్థించుచు తప్పించుకొని పారి

పోయినాడు. ఝాన్సీరాణి యతనిని వెన్నంటు సైన్యముతో "అతడు ద్రోహి, పిఱికిపంద, పారిపోనిం" డని పలికినది.

గ్వాలియర్ పీష్వా నానాసాహేబు ప్రతినిధి. శ్రీమంతు వశమైనది. 'ఫుల్ బాగ్'లో దర్బారు జరిగినది. అందు మంత్రులు, రాజనీతిజ్ఞులు, సరదారులు, ఖిలేదారులు, రాజ పుత్రులు, పఠానులు, రోహిలాలు, నరబ్బులు వారి స్థానముల నధివసించినారు. అమరచందు వశమొనర్చిన సింహాసనమున పీష్వా ప్రతినిధిగ 'శ్రీమం' తాశీను డైనాడు. ఆయన రామా రావు గోవిందుని ప్రధాన మంత్రిగను, తాతియాను సర్వ సైన్యాధ్యక్షునిగను పట్టభద్రుల నొనర్చినాడు. శ్రీమంతు పీష్వాసైన్యములకు రెండులక్షల ధనమును బహూకరించినాడు. గ్వాలియర్ దుర్గము పట్టాభిషేకోత్సవములతో గన్నుల పండు వుగ నొప్పినది.

ఆ సందర్భమున ఝాన్సీరాణి పీష్వాకు గప్పము చెల్లిం చుచు సామంతసంస్థానాధీశ్వరిగ నుండుట కంగీకరించినది. ఆమె యొనర్చిన వీరోద్రేకప్రసంగమునకు సభ యెల్ల ముగ్ధమైనది.

జనరల్ రోస్‌కు సమస్తమును తెలిసినది. మహారాష్ట్ర ములో గాక పీష్వా గ్వాలియరులో బలము చిక్కుట విచిత్ర మైన విషయము. అత డాశ్చర్యపడినాడు. శివాజీ, నానాఫడ్న వీస్ మొదలైన మహారాష్ట్రవీరుల స్వాతంత్ర్యాకాంక్ష యేవీరి హృదయముల సుస్థిరమైయుండవచ్చునని యతడూహించినాడు.

అతడు నూతన సైన్యముతో, నవోత్సాహముతో సింధియారాజ్యమున ప్రవేశించి 'గ్వాలియర్ మహారాజుకుసాయ మొనర్చుటకు దాను వచ్చినా'నని, "ప్రభువున కనురక్తులై

సాయపడు” డని ప్రజల నుద్బోధించినాడు. పాప మతనియాశ లడుగంటినవి. కాలము మారినది. ప్రజాక్షేమము నూహించి పాలింపజాలని ప్రభువునకు సాయ మొనర్పజాల మని ప్రజలు నిశ్చయముగ పలికినారు. గ్వాలియర్ ప్రభువును 'దేశద్రోహి' యని ముఖమున వాకొనిరి.

మతప్రసక్తితో విప్లవవీరులనుండి బందాను విడదీయ యత్నించి యా ప్రయత్నమం దాంగ్లేయులు విఫలులైనారు. బందా స్వేచ్ఛావీరుడు! మతోద్రేకి కాడు. హిందూ మహ మ్మదీయ సమైక్యతకు పాటుపడిన ప్రథమ వ్యక్తి!!

జూన్ 17 న గ్వాలియర్ కోట ముట్టడి యారంభ మైనది. ప్రారంభమున పీష్వాపై బందా తిరుగబడినాడు. రాణి "మన పరమాశయము స్వేచ్ఛాపతాకము యావద్భారతమున ప్రతిష్ఠాపించుట. ఇట్టి సమయమున మనలో వైమనస్యములు పొడకట్టిన మొదటికి మోసమువచ్చును. శత్రువుల కుతంత్ర ములలో జిక్కి వారిని నమ్మి మోసపోకు' మని బందా నవాబుతో మంతనములు సలిపినది. అతడు తప్పిదమును గమ నించి పీష్వాను క్షమాపణ వేడుకొనినాడు. వారిరువుర మిత్రుల నొనర్చి 'యొకరి నొకడు మోసగింప' మని రాణి ప్రమాణము స్వీకరించున ట్లొనర్చినది.

యథాక్రమముగ ఝాన్సీరాణి యుద్ధరూపము ధరించి నది. తెల్లని పై జామా, అంగరకాపై సిరని జుబ్బా, జరీ కుచ్చుల తెల్లని తలపాగ, నడుమునకు తెల్లని పట్టుసెల్లాదట్టీ బిగించినది. దుర్గ పూర్వదక్షిణ దిశల రక్షణభార మామె వహించినది. ఆమె యాంతరంగిక సేవికలు కాశీబాయి, మంద రలును యుద్ధవేషముల నున్నారు. గుల్మహమ్మద్ ఖాను,

ఖుదా బక్షు లామె పార్శ్వచరులుగ సేనలతో ననువర్తించు చున్నారు. రాణీసాహెబు శ్వేతాశ్వ మధిరోహించి యాకృష్ణ కరవాలముతో స్వసైన్యముల బర్యవేక్షణ మొనర్చుచున్నది.

ఆంగ్లేయసైన్యములు కనుచూపు మేరలోనికి వచ్చినవి. అవి బ్రిగడీరు స్మిత్ నాయకత్వమున శరవేగముతో వచ్చి పడుచున్నవి. రాణి రణవాద్యముల మొరయించినది. ఆమె సరదారులు సైన్యముల నుత్తేజపరచుచున్నారు. ఫిరంగీసైన్యములు వారి కార్యక్రమము నారంభించినవి. వాని నిర్ఘోషముల కాకాశము భిన్నించుచున్న ట్లున్నది.

ఉభయసైన్యములును దారసిల్లినవి. రఘునాథసింగు శత్రుసైన్యములో జొచ్చుకొని వారిని చెల్లాచెదరొనర్చు చున్నాడు. ఆంగ్లేయ సైన్యమున హాహాకారము లతిశయించు చున్నవి. రాణి రక్తము విప్పొంగి పొరలిపోవుచున్నది. ఎట చూచిన నభోమాస శంపాలత వలె నామె మూర్తియే శత్రువుల కన్నులయెదుట మెరయుచున్నది.

ఆంగ్లేయులు విశ్రాంతిదళముల రప్పించి రాణీసైన్యముపై నడిపినారు. ఆమె సైన్యము ధైర్యముతో నెదుర్కొని తరిమికొట్టినది. జనరల్ స్మిత్ ప్రయోజనము లేదనుకొని సైన్యమును మరలించి మరియొకవంకకు తప్పుకొనినాడు.

మరునాడు 18 జూన్, జ్యేష్ఠ శుక్ల సప్తమి, శుక్రవారము ఆంగ్లేయులు జనరల్ స్మిత్, హ్యూరాస్‌ల నాయకత్వమున మరల రాణీసైన్యము నెదుర్కొనఁ వచ్చినారు. వారిరాకను దూరమునుండి గమనించిన గుల్మహమ్మద్ వేగముగ వచ్చి "రాణీసాహెబ్! శత్రువులు మరల మనపై

బడవచ్చు చున్నా" రని పలికినాడు. రాణి మందస్మిత మొనర్చి 'రానిమ్ము. మన బలసాహసముల దెలుసుకొందు' రనినది. 'మీ మీ స్థానములలో నప్రమత్తతతో నర్తింపు' డని వారి కనుజ్ఞ నొసగి శ్వేతాశ్వమును యుద్ధభూమిని పర వళ్ళు త్రొక్కించుచు నానందించుచున్నది.

ఆనాటి పగలెల్ల యుద్ధము మహాభయంకరముగ సాగి నది. ఆనా డామె ప్రకటించిన ధైర్యసాహసముల గన్నుల పండువుగ జూచిన జనరలు రాస్ 'పాశ్చాత్య లోకమునం దిట్టి వీరవనిత యొక్క తెన్నైన జన్మించినదా? 'జోన్ ఆఫ్ ఆర్క్' ఈమె కొనగోటికి జాలదు. ఈమె మూర్తీభవించిన వీరరసము గాని యన్యముగా' దని మనస్సున సంభావించినాడు.

సాయంసమయ మాసన్న మగుచున్నది. రాణిపక్షము నుండి ఫిరంగిమ్రోతలు వినిపించుటలేదు. సకాలమునకు సామాగ్రి యందియుండదు. ఆమెపై బడుట కిదియే సమయ మని జనరలు స్మిత్ యెనిమిదవ 'హుస్సారు' లను ముందుకు జేరి రాణిని జుట్టుముట్టు డని యాజ్ఞాపించినాడు. శత్రువుల యాశ్వికసైన్యమామెను వేటకుక్కలవలె వెన్నాడుచున్నారు.

దూరమునుండి గమనించిన ఖుదాబక్ష్ యాశ్వికసైన్య ముతో వారిపై బడ వచ్చునంతలో నొకనూతనసేన యతనిపై దలపడినది. రాణిని శత్రువులు వలయాకారమున బంధించు చున్నారు. ఆమె సైన్యమున భయోత్పాతములు పొడజూపి నవి. హాహారావములు మిన్ను ముట్టినవి. రాణి యిప్పటికిని లొంగలేదు. అచంచలవిశ్వాసముతో బోరాడుచున్నది.

వెనుకనుండి యొక స్త్రీకంఠమున నార్తారావము విని పించినది. అది మందర గొంతుక. బాయిసాహెబును గత్తిం

మటకు వచ్చుచున్న యామెపై నొక యాంగ్లేయుడు తలపడి కంఠచ్ఛేద మొనర్చినాడు. రాణి యాతనిని మరుక్షణమున యమసదనమున కంపినది. 'హరహర మహాదేవ' నినాదము లతో రాణి కరాళ కాళీమూర్తివలె విజృంభించి గతిపయ నిమేషములకాలము తాండవించినది.

ఆమె యశ్వము నొక తిన్నెపై నడిపించుచున్నది. అది యొక దుముకు దుమికిన నావ్యూహమునుండి యామె తప్పించుకొనెడిది. నేడామె యధిరోహించినది నూతన నాశ్వము. క్రిందటి దినమున యుద్ధములో నామె యనురాగముతో బెంచి పాలించుకొనుచున్న యశ్వరాజము మరణించినది. ఆంగ్లేయుల యదృష్టము ఫలించినది. చుట్టు ముట్టిన యాంగ్లేయులతో నామె ఖడ్గయుద్ధ మొనర్చు సమయమున యొకని గుండెనుండి చిమ్మినరక్తమామె కంటబడినది. కనులు మూతబడుచున్నదని, హస్తమున ఖడ్గము విహరించుట మానలేదు. ఇట్టి విషమస్థితిలో నొక యాంగ్లేయుడు శక్తినంతయు వినియోగించి యామె శిరస్సున మోదినాడు. ఆమె దక్షిణ నేత్రము ముందుకువచ్చినది. అప్పటికిని రాణి 'శర' ణనలేదు. మరల నొక కత్తిపోటు హృదయభాగమున దగిలినది. రాణికి స్మృతితప్పినది. నిశ్శ్వసించుటగమనించి దేశముఖు రామచంద్రరావు మొదలగు యోధులతో నాప్రదేశమును చేరి రాణిని నిజాశ్వముపై జేర్చుకొని శిబిరమునకు వచ్చినాడు.

గుడారమున గంగాదాసు బావా తల్ప మమర్చి విశ్రమింపజేసి శీతలజలమును దాహమిచ్చి యామెకు సేవ యొనర్చు చున్నాడు. రక్తస్నాన మాడిన యా వస్త్రముల తోనే రాణి పర్యంకముపై మేనువాల్చినది.

"తాతియా!...సమరమును సాగింపుము. తల్లి దాస్య విముక్తికై తనువు లర్పింపు"మని యాజ్ఞాపించి తుదిక్షణమున దత్తపుత్రుని దామోదరుని దరిజేర్చుకొని ప్రేమపొంగులువార 'దామోదరా!' యని శిరము నిమురుచు తుదినిశ్వాస మొనర్చినది.

సూర్యకాంతి ప్రపంచము వీడినది. లక్ష్మి శరీరమును వదలినది.

రాణి యాశయము ఫలించినదా ? లేదు. స్వాతంత్ర్య యుద్ధమున విజయము సంశయాస్పదముగ నున్నది. ఫలింప లేదా? ఫలించినది. భారతజాతి నిర్వీర్యము కాలేదని ప్రచండ పరప్రభుత్వము నెదుర్కొని యామె నిరూపించినది.

జూన్ 19 న గ్వాలియరును జనరల్ రాస్ పట్టుకొని నాడు. రాణిమరణవార్త విన్న తాతియా సమరము సాగింప లేకపోయినాడు. మరల మరల రాణిమాటల జ్ఞప్తికి దెచ్చు కొని శత్రువుల జెండాడ నెన్ని యత్నము లొనర్చిన నాతని హృదయము వెలుగు లేని శూన్యగృహమై పోవుచున్నది. మానసిక వ్యధ కారణముగ నతడు బ్రిగడీరు నేపియరుకు జిక్కిపోయినాడు.

ప్రథమ స్వాతంత్ర్యయుద్ధ మంతటితో ముగిసినది. ఆ సమరవీరుల చరిత్రలు వీరగాథలై వెలసి భవిష్యత్కాలమ్మున నేక స్వాతంత్ర్య వీరహృదయక్షేత్రముల స్వేచ్ఛాబీజముల నాటి, వనముల పెంచి, ఫలముల పండించినవి.

అచంచల దేశభక్తికి, సేవాత్యాగములకు, ధైర్య సాహసములకు, ప్రజానురాగమునకు సంజ్ఞామూర్తియై లక్ష్మీ బాయి నేడును కీర్తిశరీరముతో నారాధ్యదేవతయై నిలచినది.

## ౨. లోకమాన్యుడు

ఆంగ్లేయ ప్రభుత్వము మంచిదా? చెడ్డదా? అను ప్రశ్న లేదు. దాని గుణదోషములతో మన కేమి సంబంధము? అది పరప్రభుత్వము. అందును నదృశ్యము. రాజునకును బ్రజలకును సంబంధము లేని ప్రభుత్వము! ప్రభుత్వోద్యోగుల పశుబలము తోడ్పాటుతో పాలించు ప్రభుత్వము!!

"పాలనాన్యవహార నిర్వాహకత్వము ప్రజాహస్తగతమై యుండుటయే స్వరాజ్యము."

"స్వరాజ్యాకాంక్ష ప్రతివ్యక్తికిని జన్మహక్కు; అది చట్టసమ్మతమైనది."

ముక్తకంఠముతో నీ రీతిగ బ్రథమస్వాతంత్ర్య యుద్ధానంతరము భారతీయప్రజల నుద్దేశించి కేకపెట్టిన మహావ్యక్తి 'మహారాష్ట్ర కేసరి' బాలగంగాధర తిలక్!

బ్రిటిష్ ప్రభుత్వము దేశమాతను క్రమక్రమముగ శృంఖలాబద్ధ గావించినది. శక్తిసామర్థ్యములు క్షీణింప సామాన్య ప్రజానీకము కర్తవ్యతావిమూఢమై పరప్రభుత్వ పాదతాడనములకు శిర మొగ్గుచున్నది. వివేకుల మని విర్రవీగువారు విదేశ సంస్కార వ్యామోహితులు. దేశమున విద్యాగంధము లేదు. జాతీయభావములు లేవు. సుహృద్భావము శూన్యమైనది. విచక్షణాజ్ఞాన మావశ్యక మనిపించుచున్నది. ఎటుచూచిన నంధకారము! ఈ యంధకారమును తరిమికొట్టి స్వాతంత్ర్య భానూదయమున కనూరుడై యవతరించిన మహాతేజస్వి తిలక్ మహాశయుడు!!

ఆయన జన్మభూమి, ఛత్రపతి శివాజీవంటి వీరాధివీరుని కన్నతల్లి, మహారాష్ట్రము ! శతాబ్దకాలము భారతసామ్రాట్టుగ దేశమును వీరోచితముగ పాలించిన బాలాజీ విశ్వనాథుని జననసీమ కనతిదూరమున నున్న రత్నగిరి యా వీరుని



జన్మగ్రామము ! ! మొగలాయీ ప్రభుత్వాంతమున మహాయోధులని ప్రఖ్యాతిగన్న పీష్వాల 'చిత్పావన' వంశమున నతడు జన్మించినాడు. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అను మహామంత్ర ముపదేశించి కుమారుని మహావీరునిగ దీర్చిదిద్దిన మాతృమూర్తి జిజియా నాదర్శముగ స్వీకరించి వర్తించు వీరవనిత యాయన తల్లి ! ! ! పురాతన భారతీయ సంస్కారమెల్ల గరడుగట్టిన పుంభావ సరస్వతీ మూర్తి తండ్రి–గంగాధర రామచంద్ర తిలక్ ! ! !

"తిలక్ మహాశయుడు శతాబ్దమునకు బూర్వము పుట్టి యున్నచో నొక స్వతంత్రరాజ్యమును సృష్టించుకొని సామ్రాజ్యము నోడుచుకొను బోరాటము సాగించియుండెడివా" డని యొకానొక సందర్భమున గోపాలకృష్ణ గోఖలే తన యాంగ్లేయ మిత్రునితో ననినాడట! ఇది తిలక్ మహాశయుని జీవితసర్వస్వమును వ్యక్తమొనర్పగల యభినందన వాక్యము. తిలక్ బాల్యమాదిగ జీవితాంతము వరకును ధర్మయోధుడు! కర్మవీరుడు!!

23 జూలై 1856 నా డొక శుభక్షణమున జన్మించి బాల్యము నెల్లనొకవీరకుసుమముగ బాలగంగాధరతిలక్ గడిపినాడు. తండ్రికడ విద్యాభ్యాస మొనర్చుసమయమున నాతడు జాతీయభావముల బెంపొందించుకొనినాడు. పట్టుదల యతనికి నిరంతరమును బ్రథమ బ్రాణము.

తండ్రి గంగాధర రామచంద్ర తిలక్ తన బాలునికి సంస్కృతమును, గణితశాస్త్రమును నూరిపోసినాడు. అతని మేధాసంపన్నతకు, కార్యశూరత కతడు మనమున మెచ్చుకొనుచు, 'నెన్నటికైన నా పుత్రు డొక విఖ్యాత పురుషుడు కాగల' డని యువ్విళ్ళూరి, యతని విద్యాశీలముల విషయమున విశేష జాగరూకత వహించినాడు. రామచంద్ర తిలక్ తమ్ముని కంఠముతో వినిపింప మహాకవి బాణభట్టారకుని కాదంబరీ మహాకావ్యమును విని యొకనాడు బాలగంగాధరు డా గ్రంథమును తన కిమ్మని పట్టుబట్టినాడట! తండ్రి కఠినములైన గణితముల నిచ్చి వానిని మరల తిరిగివచ్చు వేళకు దోషరహితములుగ జేసిజూపిన నట్లే యాగ్రంథము నిత్తునని కార్యాలయమునకు వెడలిపోయినాడు. బాలగంగాధరుడు,

వీరుడు, పట్టుదలతో దండ్రి కోరికను నెరవేర్చి బహుమానిని గ్రహించినాడు. ఇది తిలక్ మహాశయుని జీవితమున ప్రథమ విజయసోపానము!

తల్లియతి బాల్యముననే మృతినొందినది. ఆగష్టు '72లో తండ్రి షోడశవర్షములు ముగియక మునుపే మరణించినాడు. తదుపరి నాల్గుమాసములకు మెట్రిక్యులేషను పరీక్షలో నుత్తీర్ణుడై, '76 వ సంవత్సరమున బి. ఏ. డిగ్రీ స్వీకరించి బొంబాయి విశ్వవిద్యాలయమున '79 లో న్యాయవాది పరీక్షయందు గంగాధరుడు పట్టభద్రుడైనాడు.

పూవునకు బరిమళము లక్షణము. ప్రతిభావంతుడైన యోధునియందు ప్రాథమికదశలోనైన వీరము దాగనేరదు. విద్యార్థిదశయందును తిలక్ వీరుడు, స్వేచ్ఛాప్రియుడు, ప్రేమ పాత్రుడు. సోదరవిద్యార్థుల ప్రేమను గ్రహించి వారిని ప్రేమింప నతడు నేర్చుకొనినాడు. అవశ్యకములగు సందర్భ ముల వారి నెల్లర గూడకట్టుకొని నడిపించినాడు. అతడు వారి హృదయక్షేత్రముల జాతీయ భావబీజముల నాటి వానిని పోషించి యంకురింప జేసినాడు. మాతృదేశ సేవోద్యోగమున వారి నెల్లర తిలక్ కృతనిశ్చయుల గావించినాడు.

బాలగంగాధరుడు సూక్ష్మగ్రాహి. ఉపాధ్యాయవర్గ ముల ప్రాతపద్ధతు లతనికి నచ్చవు. వారిచ్చు టిప్పణుల నతడు గౌరవింపడు. స్వేచ్ఛాప్రియత్వ మతనికి నూతన మార్గముల వెదకిపెట్టినది. అనువాదము లన్న నతని కభిమానము లేదు. గణితమునందు క్రమవిధానమును నిరూపింపక కేవల ఫలి తాంశములను మాత్రమే లిఖించువాడు. 'నీ క్రమ'మేదని వారు ప్రశ్నింప 'నది నాబుద్ధియం దున్న' దన్నట్లు శిరము

జూపించెడువాడు. అతని విప్లవతత్వము పూర్వమార్గముల ననుసరించు నుపాధ్యాయులకు నచ్చలేదు. కాని యతని బుద్ధి కౌశలమునకు వా రాశ్చర్యపడుచు నతనిని ప్రేమతో బాలించి నారు.

సమస్త కార్యనిర్వాహణమునకు సౌష్ఠవమగు శరీర మావశ్యక మని గంగాధరుని నమ్మకము. శరీరపోషణము లేని వ్యక్తి మాతృసేవ కనర్హుడగుటయేగాక నబలుడు నని యత డనేక పర్యాయము లుద్ఘోషించి పలికినాడు. మనస్సుతో బాటు శరీర పరిశ్రమ యొనర్చి సేవాత్యాగములకు తిలక్ బాల్యదశ నుండి క్రమశిక్షణ మొనర్చుకొనుట వలననే జీవి తాంతము వర కెంతటి దీర్ఘకృషికైన నతడు వెనుదీయలేదు. ఆయనను మహత్తర స్వేచ్ఛావీరు నొనర్చిన శక్తులలో నతని శారీరిక బల మొకటి.

దేశీయులశక్తి నానాటికిని క్షీణించుచున్నది. ప్రభుత్వోద్యోగుల దురాగతములును హెచ్చుపెరుగుచున్నవి. ఎట జూచిన మృత్యువు! దేశమాత దుర్భరదారిద్ర్యము నతడు భరింపలేక పోయినాడు. స్వాతంత్ర్యమే సమస్తమునకు శరణ్య మని తిలక్ మానసమున తీర్మానించుకొనినాడు.

17, 18 శతాబ్దములలో స్వాతంత్ర్య సముపార్జనకై శక్తివంచన లేక పాటుపడిన మహారాష్ట్ర వీరయోధుల చరిత్రను తిలక్ 'జాతీయ గీతి' గ బఠించినాడు. కురుక్షేత్ర మహా యుద్ధమున కర్తవ్యతా విమూఢుడైన యర్జునునకు రాజనీతి జ్ఞుడు శ్రీకృష్ణభగవాను డుపదేశించిన గీతను కంఠస్థ మొనర్చి నాడు. అందు కర్మవీర మతనికి ద్యోతకమైనది. 'భావుకలోక మున విహరించుటవలన ప్రయోజన మే మున్నది? కర్మక్షేత్ర

మున ప్రవేశించి నేను ధర్మయోధుడను గావలసినదే యని తీర్మానించుకొనినాడు.

దుర్భర దుష్ట పరిపాలనకు దోడుగ భారతమున 1877 వ సంవత్సరమున క్షామదేవత వికటాట్టహాసములతో గరాళనృత్య మొనర్చుచున్నది. గంగాధరునికి నిద్రలేదు; ఆహార మంతకు మునుపే లేదు. ఆలోచనాపరాయణత్వమున సమస్తమును మఱచినాడు. ప్రభుత్వము ప్రబలమైనది. దేశ ప్రజలు శక్తిహీనులు, విజ్ఞాన రహితులు, దరిద్రులు, నిద్రితులు. జాతీయవిద్యలో స్వరాజ్య సమారంభమునకు గృతనిశ్చయుడైనాడు. యువకలోకమును మేల్కొల్పినాడు.

'ప్రజల కాత్మను ప్రసాదింపుడు. వారిని మేల్కొల్పు' డని మహారాష్ట్రసీమలో యువకనాయకుడు విష్ణుచిత్తచిపళూనకర్ శంఖధ్వాన మొనర్చుచున్నాడు. అదియు నతని గొంతుకను బోలినది. ప్రభుత్వముతో సమర మారంభింపవలె నన్న సమరయోధుల గూడకట్టుకొనవలెను. కళాశాలలో సహపాఠి గోపాలగణేశ అగర్కార్ గంగాధరుని కుడిభుజమై నిలతు నని ప్రమాణము చేసినాడు. ఇరువురును ప్రభుత్వోద్యోగముల స్వీకరింప మని ప్రతినలు గైకొనినారు. వారికి మరియొక మహారాష్ట్రవీరుడు నామజోషీ సహయోధుడైనాడు.

"ప్రభుత్వవిద్యా విధానము నెదుర్కొనవలెను. విజ్ఞానవంతులలో బొడసూపుచున్న వెర్రితలలకు బ్రభుత్వ విద్యావిధానము కారణము. జాతీయ విద్యను ప్రసాదించిన కొలది కాలములో బ్రభుత్వము నెదుర్కొనగల యోధు లుద్భవింప గలరు."

ఈ నిశ్చయముతో మిత్రుల తోడ్పాటువలన తిలక్ 2 జనవరి 1880 న జాతీయ పాఠశాలను ప్రారంభించినాడు. భవిష్యత్తున త్యాగమూర్తుల, దేశభక్తుల, సేవాతత్పరుల సృజింప యోగ్యమగునట్లు బుద్ధిబలమును సమస్తమును విని యోగించి యందలి విద్యావిధానము నేర్పా టొనర్చినాడు. సర్వస్వమును ధారవోసి పాఠశాలను నడుపుచు మహారాష్ట్రమును దీర్ఘనిద్రనుండి మేల్కొల్ప గంభీరోపన్యాసము లొసంగుచు కొంతకాలము తిలక్ మహాశయుడు గడపినాడు.

ఆధునిక సమరాంగణములలో వార్తాపత్రికలు ప్రముఖరంగభూము లని తిలక్ ఏనాడో గ్రహించినాడు. పత్రికా సంపాదకుడై దేశమున కొంత ప్రచారము సాగింప దలపెట్టినాడు. ఆయన యాంగ్లవిద్యా వాసనలతో మునిగి తేలుచు కేవల మాంగ్లేయమానసపుత్రులై విద్యాధికుల మని విర్రవీగువారి మనోవీథుల జాతీయవిప్లవ బీజాంకురముల నాటి నాంగ్లేయభాషలో 'మహారాష్ట్ర' యను వారపత్రికను స్థాపించినాడు. ప్రజాచైతన్యము కలుగవలె నన్న ప్రాంతీయ భాషలో ప్రచార మవసరమని గుర్తించి మహారాష్ట్ర భాషలో 'కేసరి' యను పత్రికను ప్రకటించినాడు.

ఆయన నూతన ఆంగ్లపాఠశాల యనతికాలమున మహారాష్ట్రములోని ప్రథమశ్రేణి పాఠశాలలలో ప్రథమ గణ్యమైనది. జాతీయ తత్వముతో, స్వార్థత్యాగముతో, శ్రమంచి ప్రజాహితమునకై తిలక్ ప్రకటించుచున్న పత్రికలు రెండును ప్రజల హృదయముల నాకర్షించి యందు ప్రధాన స్థానమును గల్పించుకొనినవి. ఇందుకు ముఖ్యకారణము తిలక్ సామాన్యప్రజల దృష్టియం దుంచుకొని వ్యవహరించుటయే!

వారికి స్వాతంత్ర్యేచ్ఛను, రాజకీయ విజ్ఞానమును బ్రసాదింప జూనుకొనుటయే !!

సామాన్యజనుల కపచారము లొనర్చువారు పర దేశస్థులైనను స్వదేశస్థులైనను వారిని నిశిత లేఖినీ ఖడ్గముతో నెదుర్కొనుట కా జాతీయవీరు డెన్నడును పత్రికా రంగమున వెనుదీయలేదు. దేశద్రోహుల విషయమున నీ స్వ పర విభేదరహితతయే తిలక్ మహాశయుని నాడు కాంగ్రెసరు నొనర్చిన మహాగుణము.

ఈ నూతన నాయకుడు దేశమున విప్లవబీజావాప మొనర్చుచున్నాడని పరప్రభుత్వము గమనించినది. కాలము నకై వేచియున్నది. తిలక్ మహాశయుడు సామాన్యముగా శత్రువులకు తేలికగ వశమగు శక్తిరహిత సమరవీరుడు కాడు.

తిలక్ మహాశయునకు సంస్థానాధిపతులన్న నభిమానము విస్తారము. జీర్ణించిన భారతీయసంస్కృతి నల్ప మాత్రముగ నైన నాయన వారిలో నానాడు చూడగలుగు చున్నాడు. ఆ సంస్థానాధీశ్వరుల పూర్వచరిత్రలలో నాయన కు త్తేజకశక్తి లభించుచున్నది. ఆకారణముగ సంస్థానప్రభుత్వ విషయముల తిలక్ విశేష శ్రద్ధవహించుచున్నాడు. అందు వను కొల్హాపుర మనిన నాయనకు ప్రత్యేకాభిమానము.

ఆనాడు శివాజీరావు కొల్హాపుర సంస్థానాధీశ్వరుడు. ఇతడు పూర్వసంస్థానాధీశ్వరు డగు రాజారాం దత్తపుత్రుడు. తల్లి శక్వరీబాయికి నీతనికి బాల్యముననే మనస్పర్థలు కలుగుట వలన నతనికి మత్తుపదార్థములు పెట్టించి, యున్మత్తుడనియో, మృతినొందినా డనియో, రాజ్యమును మరియొక బంధువున కామె కట్టిపెట్ట దలపెట్టినది. ఆకుతంత్రమున 'బార్వే' యను

నాంగ్లేయ దర్బారీ యామెకు సాయ మొనర్చుచున్నాడు. బార్వో కునురాణికిని మధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరము లెట్లో బయటపడితిలక్ మహాశయుని పత్రికాలయమును జేరుకొనినవి.

ఇది విద్రోహకచర్య. తిలక్ రక్తనాళము లుప్పొంగినవి. అందులకు శివాజీవంశస్థుడగు శివాజీరావు పక్షము దాను వహింపక తీరదని నిశ్చయించుకొనినాడు.

'నేను పూర్వజన్మమున మహారాష్ట్ర ఛత్రపతి శివాజీ స్వాతంత్ర్యసేనలో నొక యోధుడ'నని తిలక్ నిరంతరమును మనమున భావించు చుండెడివాడు. అతని వంశస్థుని కపచారము జరుగుట కెట్లు సహించును?

మరుక్షణమున నే పత్రికాముఖమున లేఖల ప్రచురించి సంపాదకీయమును వ్రాసినాడు. అందు జాతీయహృదయ ముట్టిపడ నాంగ్లేయ పాలనము ఖండించినాడు. సమస్త మహారాష్ట్రమునను మరుదినమున నిది పాక్కిపోయినది. దేశీయ ప్రభుత్వ పక్షపాతము వహించి రచన యొనర్చినందుకు తిలక్‌ను మహావీరునిగ బ్రజ పొగడినది. ఆయన పత్రికల ఖ్యాతి విస్తరించినది.

బార్వోదొరగ యాలేఖలు కల్పితము లని తిలక్‌పై అభియోగము తెచ్చినాడు. ఆంగ్లేయప్రభుత్వ మతని కనుకూలము. కేసు నడచుచున్నది. ఆయనయొద్ద ధనము లేదు. అట్టి స్థితిలో ధర్మవీరు డగు తిలక్‌కు బ్రజ ధనసహాయ మిచ్చినది. ప్రఖ్యాతనాయకుడు గోపాలకృష్ణ గోఖలే నాటకము లాడి తాను స్త్రీపాత్రలధరించి వచ్చిన ధనమును తిలక్‌న కిచ్చినాడు.

న్యాయాధికారి 'అనాలోచితముగ నీలేఖల బ్రచురించినా' వని తిలక్ కు నాల్గుమాసములు శిక్ష విధించినాడు. తిలక్ నిరపరాధి. పత్రికాలయమునకు వచ్చిన లేఖల బ్రచురించినాడు. లేఖల సత్యాసత్యములతో నాయనకు బనిలేదు. అయినను శిక్ష తప్పలేదు.

ఈ శిక్ష దేశమును మేల్కొల్పినది. పూనాకళాశాలా ప్రధానాధ్యాపకుడు వర్డ్సువర్తు, అధ్యాపకుడు మాండలిక్ లు తిలక్ ను, నాయన మిత్రుడు అగర్కారును శిక్షనుండి తప్పింప విశ్వప్రయత్నము లొనర్చిరి. కాని యీ విప్లవవీరుల విడిచి పెట్టుటకు ప్రభుత్వ మంగీకరింపలేదు. ప్రజలు వారు నిర్దోషులని సంక్షోభ మొనర్చినారు. వారి కేకల నది పెడచెవిని బెట్టినది. 'ప్రభుత్వము నీ రీతిగ వేడుకొనుటకంటె విముక్తులై వచ్చిననాడు వారి కుచితస్వాగత మిచ్చి సత్కరించుట యుక్తమని' 'దీనబంధు' వంటి పత్రికలు పలికినవి.

కఠినశిక్ష ననుభవించి మిత్రుడు అగర్కారుతో తిలక్ డోంగ్రేజైలునుండి విముక్తుడైనాడు. ప్రజలు పురప్రముఖులు నఖండస్వాగత మొసగినారు. సమాధాన మొసగుచు తిలక్ "మేము కారాగారములకు వెరచువారము కాము. ధర్మసంరక్షణము మా విధి. దానికై యెన్ని సమరములనైన నెదుర్కొనుటకు మేము వెనుదీయము. మా జీవితాశయమును, కర్తవ్యమును మరచిపోము. ధైర్యసాహసములతో వీనులవిందుగ వర్తింతు" మని పలికినాడు. ప్రజలకు దమపైగల ప్రీతినుగ్గడించుచు గృతజ్ఞతాపూర్వక వాక్యములు పలికి వారి జోహారులతో నిరువురును సెలవుగైకొనినారు.

తిలక్ 1884 నుండి మహారాష్ట్ర యువకలోకమును నడిపించు నాయకుడైనాడు. పూర్వము సృజించిన పాఠశాల, తరువాత నేర్పాటుచేసిన కళాశాల దేశమున జాతీయభావముల వెదజల్లుచున్నవి. పూనాలో దక్కను విద్యాసంస్థ నేర్పాటు చేసి దాని యధ్వర్యమున విద్యావిధానము సాగుటకు బ్రయత్నము లొనర్చినాడు. ఆ విద్యాసంస్థలు రెండును దినదిన ప్రవర్ధమానము లగుచున్నవి. దాన తిలక్ మహాశయుని సమరాంగణములు వర్ధిల్లుచున్న వన్నమాట!

స్వాతంత్ర్యమునకును, సంఘనిర్మాణమునకును సన్నిహిత సంబంధమున్న దని తిలక్ మహాశయు డేనాడో గమనించినాడు. కాని ప్రభుత్వసహాయముతో నూతనసంస్కరణలను గొనివచ్చుట కాయన యిష్టపడెడివాడు కాడు. సాంఘిక పరివర్తనమునకు మనస్సులు మారవలె నని యాయన యభిప్రాయము.

సంఘసంస్కరణవాదు లాయన నపార్థమొనర్చుకొని 'పండిత పక్షపాతి, పూర్వాచార పరాయణు' డని తూలనాడుచు వచ్చినారు. సంఘసంస్కరణ విషయమున నాయనకును మిత్రుడు అగర్కార్‌నకును మధ్య మనస్పర్థ లేర్పడినవి. నిజాశయములు క్రమములైనవని నమ్మిన తిలక్ అగర్కార్ వంటి యాప్తమిత్రునైన విడనాడుటకు వెనుదీయలేదు. ఆసమయమున అడ్డువచ్చిన నాత్మబంధువులనైన బరిత్యజించుటయే యావీరుని లక్షణము.

మనస్పర్థలు కారణముగ అగర్కారు 'కేసరి' పత్రికా సంపాదకత్వమునకు రాజీనామా నిచ్చినాడు. కర్మవీరుడగు తిలక్ ఆ భారమును దానే వహించుచున్నాడు. దక్కను

విద్యాసంస్థ జీవితసభ్యులకు, కార్యనిర్వాహక వర్గమునకునుగల పరస్పరసంబంధ నిర్ణయమున అభిప్రాయభేదము లేర్పడినవి. జీవితసభ్యులు తమ కాలమును విద్యాసంస్థకే వినియోగింపవలెనని తిలక్ అభిప్రాయము. అట్లైనగాని యీసమర భూములు శత్రువిజయ సాధనములు గావు; అందు వీరు లుద్భవింపరు.

ఆయనది స్వారాజ్యసమర ప్రచారక సంఘ తత్వము. అట్టి సేవాత్యాగములు గల వ్యక్తులు లభింపగను నిర్ణయములో మిగిలినవారు దానికి వ్యతిరేకించినారు. ప్రభుత్వ సహాయ మర్థించి సంస్థను పెంపొందించుట వారి యభిప్రాయము. పరప్రభుత్వ సహాయ మర్థించుట వలన జాతీయతాభావము నశించునని తిలక్ నమ్మకము.

తిలకు మహాశయునికి వ్యతిరేకు లధికసంఖ్యాకులైరి. ఆవిద్యాసంస్థ ప్రభుత్వపరము కాక తప్పదని నిశ్చయించుకొని నూతన ప్రచారావకాశముల నన్వేషింప నా సంస్థకు 1890 నవంబరు నెలలో రాజీనామా నిచ్చినాడు. అందువలన కళాశాల కొక జాతీయభావనా సంపన్నుడు, గణితశాస్త్రసిద్ధి, యుపజ్ఞగల సంస్కృతభాషా శాస్త్రాధ్యాపకుడు కరవైనాడు.

ప్రభుత్వ మింతలో 'నూత నాంగీకార చట్టమును' ప్రవేశపెట్ట తలపెట్టినది. దీని మూలమున సంఘసంస్కరణ మెట్లున్నను విభేదములు పొడజూపుచున్నవి. నాయకుడు గమనించినాడు. అతనికి స్వతస్సిద్ధమగు విప్లవశక్తితో జాతీయైక్యతకై దానిని వ్యతిరేకించినాడు.

వైవాహిక విషయికమగు నీచట్టమును బ్రవేశపెట్టిన దేశమున కలతలుపుట్టింపవచ్చుననియు, తమపాలన మందువలన

నిరభ్యంతరముగ సాగిపోవుననియు బ్రిభుత్వము తలచినది. కాని మహారాష్ట్ర కేసరి వానిని సింహబలముతో నెదుర్కొనినాడు.

దేశమున ధర్మరక్షణము కొనసాగవలెనన్న న్యాయశాస్త్రవిజ్ఞాన మావశ్యకమని గుర్తించి తిలక్ పండితుడు న్యాయపరీక్షుల కొందర నుత్తీర్ణుల నొనర్ప న్యాయశాస్త్ర పఠనమందిరమును ప్రారంభించినాడు. ప్రజాక్షేమకరములగు రచనలతో 'కేసరి' 'మహారాష్ట్ర' పత్రికలను నడిపి ప్రజల నుద్రేకించుచున్నాడు.

1894 లో తిలక్ మహాశయుడు పూనాలో బాపత్ కేసును గురించి విశేషముగ శ్రమించినాడు. అది బరోడా సంస్థానమునకు సంబంధించినది. బరోడా సెటిల్మెంటు శాఖోద్యోగి బాపత్ పై ప్రభుత్వ రాజకీయశాఖ ఘోరమగు నభియోగము తెచ్చినది. అందు నిరర్థకముగ నసత్యమునకు గురియై యొకవ్యక్తి బలియైపోవుట సహింపలేక తిలక్ అతని పక్షమువహించి న్యాయవాదిగ న్యాయస్థానమున ప్రభుత్వమునకు వ్యతిరేకముగ నతని రక్షింప యత్నించినాడు. అది బరోడామహారాజు ప్రతిష్ఠను కాపాడుటయైనది. న్యాయస్థానమున బాపతును రక్షించు సందర్భమున జేసిన తిలక్ కృషి యాయన శక్తిసామర్థ్యములను, కార్యశూరతను వేనోళ్ళ చాటుచున్నది. ఇందు తిలక్ విజయము నొందినాడు; ప్రభుత్వమోడినది; కాని పసి పట్టినది.

బాపత్ కేసు మూలముగ తిలక్ రాజకీయ సమరాంగణమునుండి తాత్కాలికముగ తొలగుట గాని, శ్రద్ధతో గార్యనిర్వహణ మొనర్పకుండుట గాని జరుగలేదు. ప్రస్తుత

మాయన జాతీయకాంగ్రెసుకు కార్యదర్శిగ లేడు. బొంబాయి రాష్ట్రీయసభ నేర్పాటుచేసి దానికి తానే కార్యదర్శియై యైదు మహాసభలు చేయించి తిలక్ మహారాష్ట్రమున రాజకీయ స్వరాజ్యవాతావరణమును సృజించినాడు.

1893 లో హిందూ మహమ్మదీయుల కంఠకలహములు చెలరేగినవి. అనేక నూతనసమస్యలు ప్రారంభ మైనవి. తిలక్ వీరుడు మరల రంగస్థలమున నగ్రగామియై నిలచినాడు. సమైక్యతకు పాటుపడినాడు.

"ఈ విద్వేషములకు ముఖ్యకారకులు స్వార్థపూర్ణులైన కొలదిమంది ఆంగ్లో-యిండియన్ ఉద్యోగులు. దీనికి ముఖ్యకారణము లార్డు డఫ్రిన్ నెలకొల్పిన 'విభజించి పాలించు' సిద్ధాంతము. ఇట్టి సందర్భమున పక్షపాతము వహించకుండుట ప్రభుత్వ కర్తవ్యము. ప్రభుత్వోద్యోగులు హిందువులపక్షము వహించి మహమ్మదీయులను,మహమ్మదీయుల పక్షమువహించి హిందువులను రెచ్చగొట్టుటవలన కలిగిన ఫలితాంశమే యిది" యని ముక్తకంఠముతో నిర్భయముగ పలికినాడు.

ఈ సందర్భమున ప్రత్యేకముగ బొంబాయి గవర్నరు హారిస్ ప్రభువును,నతని కార్యదర్శిని దోషులని ప్రకటించినాడు. ప్రభుత్వోద్యోగులు కనులెర్ర జేసినారు. దానికి ప్రతిగ మహారాష్ట్రకేసరి మరల గర్జించినాడు. 'కేసరి' పత్రికాముఖమున హిందూముస్లిముల సఖ్యతకుయత్నమొనర్చినాడు. వారిలో నూతనోజ్జీవనమును బోసి సోదరభావముతో మెలగ నేర్పినాడు.

'95 నాటికి తిలక్ విద్యాధికులందును వీరవర్యుడనిఖ్యాతి గడించుకొనినాడు. రాష్ట్రీయ శాసనసమితికి రెండుమారులు

ప్రజలాయనను సభ్యునిగ నెన్నుకొనినారు; ఆయన సేవాత్యాగములయెడ భక్తిసూచకముగ పూనానగర పురపాలక సంఘాధ్యక్షునిగ వరించి గౌరవించినారు. ఈ సదవకాశముల స్వీకరించి తిలక్ ప్రజాజీవిత రంగముల బ్రవేశించి వానిని స్వారాజ్య యుద్ధ రంగములుగ మార్చుకొనినాడు; లోకమాన్యుడైనాడు.

అనతికాలముననే మహారాష్ట్రమునం దంతటను జాతీయ సంస్థలు ప్రారంభమైనవి. జాతీయనాయకుల జన్మదినోత్సవము లొనర్చుట పరిపాటియైనది. సమస్తమును నడిపించు మహాశక్తి తిలక్ పండితుడు.

పూనానగరమున శివాజీ జన్మదినోత్సవములో నొక సందర్భమున మూర్తీభవించిన జాతీయతవలె మహోపన్యాసము గావించి యాయన యిట్లన్నాడు :

"మన దేవతలను, జాతీయవీరులను గౌరవించి పూజించుట వారి కొరకుకాదు; మనకొరకే. అందువలన మనలో దేశభక్తి, జాతీయభావములు పెంపొందును. ఉన్నతాదర్శములు, జీవితలక్ష్యములు మనకు ద్యోతకము లగును.

"నేటి యువకులు జాతీయులుగ గాని విదేశాశ్రయములను, విదేశాచారములను వెర్రిగ ననుకరించుచున్నారు. దాని వలన విశేషప్రమాదములు సంభవింపగలవు. ఈయంధానుకరణము జాతి నైతికశీలమునకు గొడ్డలిపెట్టు. చిరకాలము వీని నిట్లే సాగనిచ్చిన గల్గు ఫలితాంశము జాతిపతనము! దేశదౌర్భాగ్యము !!

"మనలను మనము గౌరవించుకొనుట నేరుగవలెను. అది మన ప్రాచీనులను, మన సంస్కృతిని గౌరవింప నేర్చిన

నాడే యలవడగలదు. ఆత్మనింద సన్న్యాసిజీవితమున నుపకారి కావచ్చును. కాని జీవితక్షేత్రమున కర్మవీరునకు నిరుప యోగము.

"అత్యధికమైన స్వోత్కర్షయును దూష్యమే. అది దేశ మాతయెడ నైనను ప్రమాదకారి. దానివలన వృద్ధిలేదు. వృద్ధిలేకున్న మరణ మన్నమాట." ఇట్టి వాక్యగత్నముల నెన్ని టినో యా గంభీరోపన్యాసమున నాయన యొలికించినాడు.

శివాజీ జన్మదినోత్సవముల జరిపించుటకు తిలక్ ఒక యుద్యమము నారంభించినాడు. కేసరి పత్రికలో నొక వ్యాస మును ప్రకటింప (23 ఏప్రియల్ 1895) మహారాష్ట్రులు రాయఘుడ దుర్గములోనున్న శివాజీస్థానమును బునర్నిర్మాణ మొనర్చుట కిరువదివేల రూప్యముల నిచ్చినారు. నిర్మాణ మైనది. ప్రతివర్షమున నచ్చట నాజాతీయవీరుని స్మారకోత్సవ ములు జరుగుచు వచ్చినవి. ఆపద్ధతి ననుసరించి గ్రామగ్రామ ముల శివాజీపండుగలు ప్రజలు లోకమాన్యుని యీదేశమున జరుపుకొనుచున్నారు.

1896 లో బొంబాయి రాష్ట్రమున మున్నెన్నడును ప్రజ లెరుగని ఘోరక్షామము వచ్చినది. వారు రస్తకష్టములు పడుచున్నారు. వారి నాయకుడుచూచి సహింపలేకపోయినాడు. ప్రభుత్వ మౌదాసీన్యము వహించినది. తిలక్ రణరంగమున లేఖినీఖడ్గముతో ప్రవేశించినాడు. పీడితప్రజానీకము నుద్దే శించి గంభీరముగ నిట్లు 'కేసరీ' పత్రికాముఖమున గర్జించినాడు:

"క్షామదేవత వికటహాసములు వినిపించుచున్నవి. ఆమె కరాళతాండవమున మిన్నుమన్నెరుగక మీారు తల్లిట

పడుచున్నారు. ఈ చావుబ్రతుకుల సంధిలోనైన ప్రభుత్వో ద్యోగులు మిమ్ము పీడింప మానలేదు. భయపడకుడు !

"విక్టోరియా మహారాణి మనల నందర క్షేమముగ నుండుడని కోరుచున్నది. భారతప్రభుత్వ వాంఛయు నదియే. ధైర్యవిరహితులు కాకుడు. క్షామమునకు బలికాకుడు. పన్నులు చెల్లింప మీయొద్ద ధనములేకున్న ప్రభుత్వో ద్యోగులకు వెరచి సమస్తమును అమ్ముకొనకుడు.

"మృత్యు ముఖమున బ్రవేశించుచున్నను మీకు ధైర్యసాహసము లబ్బలేదా? ఔను! లేదు. మనది కేవలము గొఱ్ఱెజాతి. ఇట్టి క్షామ మింగ్లండుదేశమున వచ్చిన బ్రభుత్వ మెంత యాందోళన పొందెడిది ? ఆ ప్రధానమంత్రిని ప్రభుత్వమును వారము దినములలో ప్రజలు తారుమారొనర్చెడు వారు."

క్షామనివారణార్థము తిలక్ ప్రభుత్వమున కనేక సూచనల నొనర్చినాడు; 'క్షామ చట్టము' నమలుపరచ వలసిన దని ప్రభుత్వమును వేడుకొనినాడు. పూనా నగరమున దక్కువ ధరలకు ధాన్యమమ్ము విపణివీధుల నేర్పాటు జేయించినాడు. షోలాపూరు, నాగపూరులోని 'సాలెవా' రనుభవించు బాధల భరింపలేక వారికి సహాయనిధు లేర్పాటు చేయించినాడు. స్థానిక నాయకులతో సంప్రతించి ప్రభుత్వ సహకారముతో క్షామ నివారణ మొనర్ప నొక ప్రణాళికను సిద్ధముజేసి ప్రభుత్వమున కందజేసినాడు.

ఇట్టి యాందోళన మెన్నడును ప్రభుత్వము సహింపలేదు. అందును ప్రజాహృదయమును జూరగొని విప్లవ తత్వ

ముతో ప్రజలకు ప్రభుత్వము నెదుర్కొనశక్తి నిచ్చు తిలక్ ప్రణాళికను ప్రభుత్వోద్యోగు లంగీకరింతురా? మహారాష్ట్ర సార్వజనిక సభచే నొత్తిడి జేయించినాడు. ప్రభుత్వమే పెడ మొగముపెట్టి 'వీలుకా' దని పలికినది. లోకమాన్యుడు నిరుత్సాహ మెరుగనివాడు. ఆనాడు జాతీయకాంగ్రెసు పాశ్చాత్య సంస్కార వ్యామోహితుల చేతులలో నున్నది. దానికి సర్వ ప్రజల కందు స్థానములేదు.

కేసరి పత్రికలో "ఈనాడు దేశమున నూతన దృక్పథమును గల్పించినది. ప్రజలు మేల్కొనినారు. ఇకనైనను జాతీయమహాసభా నాయకులదృష్టి మార్పునొందవలెను.

"మా యార్తరవములు చెవియొగ్గి వినుడని ప్రభుత్వముతో ద్వాదశవర్షములు మొరపెట్టుకొనినాము. ప్రయోజనము గగనకుసుమమైనది. మన తీర్మానములు వారి హృదయమున నాటుకొనలేదు. ప్రజాసహకారముతో బద్ధసమ్మతిమైన పోరాటము సాగించి వానిని వారి చెవులలో బలవంతముగనైన ప్రవేశపెట్టవలసిన కాల మాసన్నమైనది. మనము విద్యాధికుల మను గర్వ ముజ్జగించి యజ్ఞానులైన గ్రామీణులతో నిరంతర సంబంధ మేర్పరచుకొనవలెను. వారికి సమాన గౌరవ ప్రతిపత్తుల నిచ్చి పోరాటములకు వారిని మేల్కొల్పుటయే నేడు నాయకుల కర్తవ్యము.

"ఆనాడుగాని జాతీయమహాసభ యను నామము సార్థకముకాదు; నాయకులకు విజయము చేకూరదు" దని మొహమాటములేక పలికినాడు. ఉబుసుపోకకు రాజకీయరంగమున ప్రవేశించిన వ్యక్తుల హృదయముల నీమాటలు భగ్నమానప్రతిష్ఠుల

కలిగించినమాట వాస్తవము. ఇట్టి వీరోచిత వాక్యములతోనే తిలక్ మహాశయుడు ప్రజాహృదయ సింహాసనమున నధినేతగ పట్టభద్రుడైనాడు.

క్షామము వెనుకపట్టినది. పూనాలో 'ప్లేగు' తుడిచి పెట్టుచున్నది. నాయకుల మనుకొనిన మహనీయు లందరును భయరహిత ప్రదేశములకు పలాయనమంత్రము పఠించు చున్నారు. లోకమాన్యుడు నమ్మిన సేవాదళముతో ప్లేగు నెదుర్కొనినాడు. పత్రికా ముఖమున ప్రభుత్వమును 'బ్రజలకు సేవాధర్మముగ భావించి సాయమొనర్పవలసిన' దని కోరినాడు.

శివాజీపండుగలు గ్రామగ్రామమున బరిపాటి నైపోయి నవి. దాని మూలమున జాతీయభావ వ్యాపనమొనర్చి ప్రజా నీకమును స్వరాజ్య సమరవీరులుగ దీర్చిదిద్దుట కవకాశము గలిగినది. పూనా నగరమున తిలక్ మహాశయు డొసగిన యొక యుపన్యాసము కేసరి పత్రికలో బ్రకటితమైనది. (15 జూన్ 1897)

తరువాత గొంతకాలమునకు పూనానగరమున 25 జూన్ '97 న 'రాండు', 'అయెర్స్టు' అను నిద్దు రాంగ్లేయుల నెవరో హత్యగావించినారు. తత్ఫలితముగ తిలక్ మీద రాజ ద్రోహ నేరమును బ్రభుత్వము మోపినది.

ఆర్గు రాంగ్లేయులను, ముగ్గురు దేశీయులను జ్యూర ర్లు (పంచాయితీదార్లు)గ న్యాయస్థానము నియమించినది. ఆంగ్లేయులు తిలక్ 'దోషి' యని, దేశీయులు 'నిర్దోషి' యనియు, అభిప్రాయపడుటవలన ముఖ్యన్యాయాధికారి దోషియని తలచిన నితడు చెప్పి పదునెనిమిది మాసములు కారాగారవాసమును విధించినాడు.

తిలకు ఈ కేసుమూలమున కొంత ప్రచారమునగ్గ 'ప్రీవీ కౌన్సిలు'కు గొనిపోయినాడు. ప్రయోజనము కనుపించలేదు. కాని తిలకువీరుడు విఖ్యాతిగాంచినాడు. జగద్విఖ్యాత పండితులు, తిలకు మిత్రులు, మాక్సుముల్లరు, సిరిలియం హాంటర్లు విక్టోరియా మహారాణి నొద్దికి జేయుటవలన బ్రిటిషు ప్రభుత్వ మా 'మహారాష్ట్ర సింహము'ను కారాగారమున బంధింపలేక 6 సెప్టెంబరు 1898 న విముక్తి నొసర్చినది.

ఆరు నెలలలో శరీరస్వస్థతను జేసుకొని చెన్నపట్టణ మున జరిగిన జాతీయకాంగ్రెసు మహాసభకేగి స్వాతంత్ర్యము న్యాసము లిచ్చి తిలకు సింహళదేశ భాగవతీయుల దర్శించి వారిని మేల్కొల్పినాడు.

తాయి మహారాజుకు తిలకు స్నేహితుడు. మరణసమయము న నతడాయన నొక 'ట్రస్టీ'గ నియమించినాడు. ఆ మహారాజు దత్తపుత్రుని విషయమున తిలకు ఆంగ్లేయుల నెదుర్కొనవలసివచ్చినది. ధర్మవీరుడగు నాయన వెనుకంజ వేయలేదు. తిలకుపై తప్పుడుసాక్ష్య మిచ్చెనను నేరారోప ణము జరిగినది.

జిల్లాజడ్జి ఆస్టను తిలక్ చిక్కినచో శిక్షింప కాచుకొని నాడు. తిలకును 'దోషి' యని తీర్మానించి చట్టసమ్మతములు గాని సభ లేర్పాటుచేయించుట, మోసము, కోర్టులోగా మొదలగువానిలో నాయన పాల్గొనుటచే వానిని గురించి యును విచారణ జరుగవలసిన దని ప్రభుత్వము సర్ధించినాడు. ఇది కేవల మాంగ్లేయ దౌర్జన్యము. తిలకు సహింపలేదు. 'ప్రీవీకౌన్సిలు' కప్పీలు జేసినాడు; అందు పరిష్కారమై విజయ

పొందినాడు. ఇది ప్రభుత్వోద్యోగులపై లోకమాన్యుని మొదటి విజయము !

1905 లో వంగరాష్ట్ర విభజన జరిగినది. అందువలన యావద్భారతమున నూతనాందోళన మారంభమైనది. దేశమున స్వదేశ, స్వరాజ్య, బహిష్కరణ, జాతీయవిద్యలను నవీనశక్తు లుద్భవించినవి. తిలక్ రాజకీయరంగమున మహావీరునివలె దుమికినాడు. కార్యశూరతతో స్వదేశవస్తుప్రోత్సాహమునకు, విదేశవస్తు బహిష్కారమునకు బూనుకొనినాడు. గంభీరోపన్యాసము లొసగి స్వరాజ్యమన భారతదేశపరిపాలనమున భారతీయులకు స్వేచ్ఛగలిగియుండుట యని నిర్వచించి యాయన స్వరాజ్య స్వరూపము కన్నులకు గట్టునట్లు విశదమొనర్చినాడు.

కాంగ్రెసు రాజకీయములు కర్మనిష్ఠుడగు తిలకు మహాశయునకు దృష్టికలిగింపలేకపోయినవి. కర్జన్ ప్రభువు దౌర్జన్యయుతముగ ప్రభుత్వమును సాగించుచు సామ్రాజ్యతత్వముతో స్వేచ్ఛగ సంచరించుచున్నాడు. మితవాదులు ప్రభుత్వమును ధిక్కరింపలేరు. అత్యావశ్యకముగ యోధులు కాంగ్రెసు సంస్థలో ప్రవేశించి తీవ్రముగ కార్యనిర్వహణ మొనర్పవలసిన సమయ మది.

మితవాదులు భారత రాజ్యాంగచట్టము ననుసరించి చట్టసమ్మతముగ ప్రభుత్వవిధానమున మార్పులు గొనిరావలెనని పలికినారు. తిలకు తీవ్రవాది, తీవ్రవాదులకు నాయకుడు. భారతమున కొక రాజ్యాంగ మున్నదా? — చట్టము లొనర్చువా రాంగ్లేయులు. వారికిని మనకును విరోధమైన చట్టసమ్మతమగు పోరాట మెట్లు సాధ్యపడు నని మితవాదుల

నాయన ప్రశ్నించినాడు. కలకత్తా కాంగ్రెసు మహాసభలో
"దేశము పూర్ణస్వరాజ్యమును, స్వపరిపాలనమును బొందు
టయే కాంగ్రెసు పరమలక్ష్యము. ఒకనాడు ప్రభుత్వమును
ప్రార్థించుచు, జట్టసమ్మతమైనపోరాటమును సాగించుచున్నాను.
అదిచాలదు. స్వదేశీ, బహిష్కరణ, జాతీయవిద్య యను
మహాస్త్రత్రయమును ప్రయోగించి [illegible]
స్వరాజ్యస్థాపన మొనర్చవలయును [illegible]" అని
యుద్ఘోషించిన వాక్యములు జాతీయవాదుల [illegible].
వారికి సమరాగ్రేసరుడు, మహానాయకుడు లోకమాన్యు
డైనాడు.

1886 లో మితవాదులు తిలకు [illegible] సంకల్పమును
స్వదేశ, బహిష్కరణ, జాతీయవిద్యల త్రోసిపుచ్చినారు. కాని
వాత తిలకు మహావీరుడు "ఇది యాత్మనాశము" అని ఘంటా
పథముగ బలికినాడు. సూరత్ లో జాతీయవాదుల [illegible]
అరవిందఘోష్ నాయకత్వమున నొక మహాసభ నాయన
జరిపించినాడు.

"ఇరువురము (అతివాదులు, మితవాదులు) దేశాభ్యు
దయమునకు బాటుపడువారమే. మనమధ్య స్పర్థ యుండ నవ
సరము లేదు. జాతీయవాదు లొక యడుగు ముందుకు వేసి
నారు. 'బహిష్కరణ' జాతీయవాదుల సమగ్రసాధనము. ఇది
కేవల మాంగ్లేయ వస్తుబహిష్కరణతో నాగునది కా" దని
సుహృద్భావముతో గర్మవీరుడు తిలకు పలికినాడు.

తిలకు 1908 లో రాష్ట్రమంటలను [illegible]
'రాష్ట్రమాత' యను నూతన పత్రికను స్థాపించి, జాతీయ
విద్యతో ప్రభుత్వము నెదుర్కొన 'సమర్థ' జాతీయ విద్యాలయ

మును నిర్మించినాడు. పూనామండల జాతీయమహాసభ జరి
పించి 'ఇక స్వరాజ్య మిమ్మని ప్రభుత్వము నర్థింపను. ఇందల్లి
తీర్మానము లెల్ల ప్రజల కనుశాసనము' లని ప్రకటించినాడు.

ప్రభుత్వాదాయముపై ప్రజాదృష్టిని మరలించి మద్య
పానమును నిరోధింప యువకుల ప్రేరేపించినాడు. స్వయం
సేవక వీరుల సృజించుకొని కల్లుదుకాణముల సమరాంగణ
ముల గావించి తిలకు ప్రభుత్వము నెదుర్కొనినాడు. ఫలితాం
శము సేవకుల 'పికెటింగు', ప్రభుత్వపు 'లాఠీచార్జీ' లు,
అరెస్టులు.

వంగదేశ విభజనము వలన యువకరక్త ముప్పొంగి
వారిలో గొందరు సాయుధ విప్లవవాదులు కసిపట్టలేక నాంగ్లే
యుల భయపెట్టుటకై హత్య లొనర్చినారు. మితవాదులు
వారిని ద్రోహులని తెగడినారు. సమరప్రియుడు తిలకు మనమున
వారి దేశభక్తిని శ్లాఘించియు పైకి పొగడలేదు; తెగడలేదు.

"వంగదేశములోని కొందరు యువకులరక్త ముప్పొంగి
నది. హత్యలు జరిగినవి. ప్రజాభిప్రాయమును లెక్కింపక
పాశవశక్తితో నణగద్రొక్క నాంగ్లేయోద్యోగులుయత్నించు
టయే వీనికి ముఖ్యకారణము. ఇది మా విశ్వాస" మని
యాయన ప్రకటన యొనర్చినాడు. బొంబాయి గవర్నరీరచ
నను జూచి 'ఇది నిప్పుతో చెరలాట' మనినాడు. బ్రిటిష్
కుటిలపాలనమును సహింపలేక తిలకు ఈ కాలమున లేఖినికి
బదునెక్కించి ప్రయోగింప నారంభించెను. తత్కారణముగ
ప్రభుత్వ మాయనపై రాజద్రోహ నేర మారోపించి [illegible]
రించుచున్నది. మనోనిశ్చయముతో తిలకు 'నేను నిర్దోషి' నని
ప్రకటించినాడు. 'ఇందు మరణించిన స్వర్గము, జయించిన

'రాజ్యపాలన' మనునర్థముగల గీతావాక్యమును జూడవచ్చిన స్నేహితుల నుద్దేశించి యాతడు పలికిన దీ సందర్భముననే.

విచారణ ముగిసినది. ఆరుసంవత్సరములు కఠిన కారాగారశిక్ష ప్రభుత్వ మాయనకు విధించినది.

'నీ వేమైన జెప్పదలచితివా!' యని న్యాయాధిపతి లోకమాన్యుని బ్రశ్నించినాడు.

"మీ తీర్మాన మెట్లున్నను నేను చెప్పదలచినదొకటే. నేను నిర్దోషిని. ఈ న్యాయస్థానమును మించిన పరమేశ్వర న్యాయస్థాన మొకటున్నది. నేను స్వేచ్ఛగ నుండుటకంటె నిట్లు బాధితుడ నౌట వలననే నా జీవితాదర్శము వ్యాప్తి పొందునని భగవాను డుద్దేశించినట్లున్నా" డని తిలకు సమాధానము చెప్పినాడు.

బర్మాదేశములోని మాండలే కారాగారమున నారు సంవత్సరముల శిక్ష ననుభవించి తిలకు 1914 లో విముక్తుడైనాడు. చెఱసాలలో నున్నపు డాయన స్వదేశమును గురించియు, స్వరాజ్యమును గూర్చియు తీవ్రముగ నాలోచించినాడు. భారతదేశమునకు బ్రముఖ తత్త్వగ్రంథమని పరిగణిత మగుచున్న గీతను బరిశీలించి యా శాస్త్రమగు దది కర్మ ప్రతిపాద్యమగు గ్రంథ మని నిరూపించు 'గీతారహస్యము'ను రచించినాడు.

తిలకుపండితుడు సమస్తమును విమర్శనా బుద్ధితో బరిశీలించు స్వభావముగలవాడు. ఇంతకు బూర్వ మున్న సిద్ధాంతములను విప్లవదృష్టితో బరికించి సత్యాన్వేషణ మొనర్చుట యాయనకు విశేష కుతూహలము. ఆర్యుల ప్రథమ నివాసము

మధ్య 'ఆసియా' యను పాశ్చాత్య సిద్ధాంతముపై దండెత్తి యది యుత్తరధ్రువ ప్రాంత మని నిరూపించుట. కాయన పూర్వమే 'ఆర్కిటిక్ హోమ్ యిన్ ది వేదాస్' అను నుద్గ్రంథమును బ్రచురించి జగద్విఖ్యాతి గనినాడు.

తిలక్ మహావీరుని యరువది యొకటవ జన్మదినోత్సవ మును మహారాష్ట్రమున వైభవోపేతముగ 1915 లో మిత్రులు జరిపించినారు. ఆ సందర్భమున నాయన భూత భవిష్య ద్వర్తమాన భారతమును విమర్శనాత్మక బుద్ధితో బరిశీలించి యిట్లు పలికినాడు :

"నాదృష్టికి నిరంతరమును శ్రమ, కష్టనిష్ఠురములు మాత్రమే కనిపించుచున్నవి. మన స్వప్న స్వరాజ్యమున కింక నెన్నియో సమరములు సాగింపవలెను. ప్రజాక్షేమకరము లైన కార్యకలాపముల జక్కబెట్టుటకు పరమేశ్వరు డాయు రారోగ్యములు ప్రసాదించుగాక !"

జన్మదినోత్సవమునాడు ప్రజ లొసగిన లక్షరూప్యముల బహుమానమును, తిలకు స్వరాజ్యోద్యమమునకే వినియో గింతునని పలికినాడు. ఆ సందర్భమున నొనర్చిన గంభీరోప న్యాసమునకును, బెల్గాము—1 మే '16 — అహమ్మదా బాదులో—31 మే'16—స్వపరిపాలనను గురించి చేసిన ప్రసంగములకును బ్రభుత్వము గగ్గోలుపడినది.

"ఈ యాంగ్లేయ ప్రభుత్వపు నీడను మనము నిలువ వలెను. కాని యిట్లునిలచి నేర్పడిన రాజకీయ కార్యదర్శి మన కక్కరలేదు. భారతదేశద్రవ్యము నెవరు వ్యయింపవలయునో, పన్నుల నెట్లు విధింపవలయునో మనము తీర్మానింపవలెను.

"నేటి ప్రభుత్వము లోపభూయిష్ఠము. ఇందుకు కారణము మనకు స్వారాజ్యము లేకపోవుటయే. గాణి ప్రకటన మొకరీతిగ నున్నది. ఉద్యోగుల పాలన మొకరీతిగ నున్నది.

"'మా కధికారము కావలయును. అది మా చేతులలో నుండవలె' నని చెప్పుటకు దగిన ధైర్యసాహసములైన నధమపక్షము మీ కుండవలయును. ప్రభుత్వసేవకులు ప్రజాసేవకులమని భావించున ట్లొనర్పవలెను. ప్రయత్నించిన మీ కిది సుసాధ్యము."

1 జూను '16 న అహమ్మదాబాదులో నొసగిన మరియొక యుపన్యాసమున 'తిలక్ మహారాజ్ కు జై' యను, నినాదముల మధ్య—

"స్వారాజ్య మబ్బనియెడల స్త్రీ విద్యాభివృద్ధి కలిగినను, పారిశ్రామికాభివృద్ధి కలిగినను, సంఘసంస్కరణము కలిగినను నిష్ప్రయోజనము. ఇవన్నియును స్వారాజ్యభాగములు. మనకు స్వేచ్ఛ కావలయును. దానివలన నధికారము, జ్ఞానము లభించు"నని ముక్తకంఠముతో దీక్షాపరుడై యాయనస్వారాజ్యాందోళన మొనర్చినాడు.

ఈయుపన్యాసములలో ప్రభుత్వోద్యోగులను 'ధాన్యపు కొట్ల కావలాదార్లు' 'దేవతలకును మనకును మధ్య పూజారులు' అని పేర్లు పెట్టుటవలన వానిని గఠినవాక్యములుగ ప్రభుత్వము భావించినది. సర్కారు తిలకుపై జామీను కేసు తెచ్చిరి. విచారణ జరిగినది. ప్రథమమున 'దోషి' యని తీర్పు వచ్చినది. హైకోర్టువారు నిర్దోషియని తీర్మానించి జామీను శిక్షను తొలగించినారు.

ప్రభుత్వము 'తిలక్ కాలమునాడే హిందూ ముస్లిము లకు సఖ్యత లేదు? స్వరాజ్య మిచ్చుట యెట్లు పొసగు'నను చున్నది. 'రాష్ట్రప్రభుత్వములను కేవలము మా ముస్లిము సోదరుల కిచ్చిన నాకు సంతోషము. కేవల నిమ్నజాతులకిచ్చిన నాకు పరమసంతోషము' అని రాజనీతిజ్ఞతతో తిలక్ ప్రభుత్వ కుటిలత నెదుర్కొనినాడు.

1916 వ సంవత్సరమున స్వపరిపాలనను గురించి విశేష ప్రచారము సాగించి తిలకు ఇంగ్లండుకు రాయబారమున కేగ నిశ్చయించినాడు. ప్రజ లామోదించినారు. అనేకములైన యంతరాయముల మూలమున గొంతకాలము ప్రయాణ మాగినది. నిరాశపొందక నాంగ్లదేశమున కేగి లోకమాన్యు డాంగ్లేయులతో భారతభూమి నెంత యవినీతికరముగ ప్రభు త్వోద్యోగులు పాలించుచున్నారో వెల్లడించినాడు. విషయ విస్తర పరిజ్ఞానముతో గన్నులగట్టినట్టు భారతీయుల దుస్థితిని వారికి విశదపరచినాడు. ఆమహనీయుని గంభీరోపన్యాసములకు లండను ప్రజ మంత్రముగ్ధులైనారు. విజయముతో నాయన తిరిగి వచ్చినాడు.

ప్రపంచ ప్రథమసంగ్రామము సాగుచున్న కాలము స్వరాజ్యసంపాదనమున కనుకూలమని గ్రహించి తిలకు నాయ కత్వమున మేల్కొన్న భారతీయులు స్వపరిపాలనకై చేయు నాందోళనము తీవ్రతరముగ సాగుచున్నది. ప్రభుత్వము జాతీయసంస్థలను సభలను నిషేధించినది. తిలకు సమరము సాగింప బ్రోత్సహించి కాంగ్రెసుచే 'అసహాయోద్యమ' 'చట్టతిరస్కార' తీర్మానములు చేయించినాడు. 'రాజ్యాంగ మున మార్పుల కొన్నిటినైన బ్రవేశపెట్టునట్లు బ్రయత్నింప

వలసిన' దని మాంటేగు, షేమ్సుఫర్డులను భారత దేశమునకు ప్రభుత్వ మంపినది. వారి ప్రణాళికను జూచి తిలకు "తిలకు దర్శించిన స్వారాజ్య మిందు లేదు. ఇది రవిలేని యుషస్సు"ని పలికినాడు.

తిలకు మహాశయుని లేఖినినుండి 1895 లో 'స్వారాజ్య' మను శంఖారావము వినిపించినది. జాతీయ కాంగ్రెసును బహుళసమరములు సాగించి ప్రజాసంస్థగ జేయు నా మహోత్కృడు యత్నించినాడు. అది 1916 లో లక్నో కాంగ్రెసు కాపున యధ్యక్షు డగుటతో నీడేరినది. ఆసంవత్సరమున మితవాదుల, జాతీయ తీవ్రవాదుల సమైక్యమొనర్చి 'ఐక్యసమర మారంభింపవలసినదని యాదేశించినాడు. ఇంతలో 'క్రొత్తగొంతుక' తో భారత రాజకీయరంగమున గాంధీజీ నూతన నాయకుడుగ నవతరించినాడు. వృద్ధాప్యము కారణముగ సమరాంగణము నుండి విరమింపదలచిన తిలకు మహాశయు డాయన కత్యానందముతో స్వాగతవాక్యములు పలికినాడు.

తిలకు సమరాంగణమున నిలచినాడు. 'ప్రభుత్వమున కాయనయన్న వెఱపు; మితవాదులకు జంకు; ఉద్యోగుల కసహ్యము. కాని లోకమాన్యుడు దేశీయులకు దేవతామూర్తి!

"అతని ప్రభావ మతినిశితమైనది. అతని పాండిత్యము ప్రాక్పశ్చిమముల వినుతిగన్నది. అతడొక అయస్కాంతము. నాయకుని కత్యావశ్యకములైన దయాదాక్షిణ్యములు, కార్య నిశ్చయ పరిజ్ఞానము, స్థిరసంకల్పము, నీతి విచక్షణత, కార్యా చరణము, సామాన్య జనాదరము నతనిలో బుంజీభవించినవి. రాజకీయరంగమున బ్రవేశించి యతడు విప్లవశంఖారావ మొనర్చుచున్నాడు. ఇక భారతము నిద్రించుట కల్ల."

ఇవి యాంగ్లేయ ప్రభుత్వము . భారతీయాసంతృప్తికి గారణముల బరిశీలింప నంపిన శత్రుపక్షమువా డగు సర్ వెలంటైన్ షిరోలు మాటలు.

స్వేచ్ఛా సమరయోధుడై భారతమును మేల్కొల్పిన వాడు లోకమాన్యుడు !

మరణసమయ మాసన్నమైనప్పు డా మహామహావుడు సోదర భారత స్వరాజ్యవీరులను, ప్రజల నుద్దేశించి 'భయ పడకు' డని పునీత విశ్వాసముతో నొక మహాసందేశ మిచ్చి నాడు. అది గీతలోని క్రింది ప్రవచనము.

"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహమ్॥"

'ఏనాడుధర్మగ్లానిసంభవించునో యాధర్మముసుద్ధరించుటకై నే నవతరింతు'నని కృష్ణపరమాత్ము డన్న పలుకులివి !

# ౩. గాంధిజీ

జీవితమున నిరువది వత్సరములు సత్యముతో బరిశోధనల సల్పి సత్యాగ్రహ సమరముల లభించిన విజయములతో మహాత్ముడు 1915 జనవరి నెలలో ఆఫ్రికానుండి స్వదేశము దిరిగి వచ్చినాడు. సామ్రాజ్యతత్త్వపు టినుపపాదములక్రింద మ్రగ్గుచున్న భారతీయ సోదరుల నుద్ధరింప నూతన సాధనము



లతో నా యనుభవజ్ఞుడు విచ్చేయుచున్నాడని సమస్తభారత ముప్పొంగుచుండెను.

నౌకదిగిన మరుక్షణముననే గాంధిజీతో సంప్రదింప నొక పార్సీ పత్రికా విలేఖరి వచ్చి యాంగ్లేయభాషలో సంభాషణ నారంభించినాడు. గాంధిజీ మొట్టమొదటనే "సోదరా! నీవు భారతీయుడవు. నేనును భారతీయుడను. నా మాతృభాష గుజరాతీ. ఆంగ్లేయభాషలో నన్నెందుకు ప్రశ్నించుచున్నావు?

దక్షిణాఫ్రికాలో నివసించుటవలన నా మాతృభాషను మరచి పోయినానని భావించినావా? నేను బారిష్టరును గనుక నా భాషలో మాట్లాడుట యుదాత్తమని తలచినావా?" యని యడిగెను. ఇట్టి స్వదేశాభిమానముతో మహాత్ముడు మాతృదేశమునకు తిరిగి వచ్చినాడు.

గాంధీజీ వెలుగు కాగడావలె విదేశమునుండి వచ్చినాడు. ఆయన దేశమునకు నేర్పిన ప్రథమ పాఠ మభయము. బ్రిటిష్ ప్రభుత్వ భయము, సైన్యభయము, భూస్వాముల భయము, ఋణదాతల భయము, నిరుద్యోగభయము, సర్వవ్యాప్తమైన యీ భయము నెదుర్కొని ధిక్కరింపుమని మహాత్ముడుచ్చకంఠమున నాసేతు హిమవత్పర్యంతము విను నట్లు కేక పెట్టినాడు. భయనిద్రనుండి మేల్కొల్పుటయే యీ విశిష్ట సమరనేత ప్రథమ విజయవిధానము.

"నేను బానిసగనుండ నంగీకరింపలేను. నిర్భాగ్యుడైనను నిది నా దేశమని సగర్వముగ వ్యవహరింపగల భారతమునకై నే బాటుపడుదును. నా భారతమున వర్గభేదము లుండవు. సహజసౌహార్ద్రముతో సమస్త ప్రజలందు సుఖజీవన మొనర్తురు. అం దస్పృశ్యత లేదు. సమాన ప్రాతినిధ్యమే దాని ముఖ్యసూత్రము.

"భారతీయ సంస్కృతి కేవలము హిందూసంస్కృతి కాదు. అట్లే ఇస్లాం సంస్కృతియును గాదు; మరే యితర సంస్కృతియును గాదు. వీటన్నిటిని సమ్మేళన మొనర్చుకొని యుద్భవించిన విచిత్ర సంస్కృతి, విశిష్టసంస్కృతి, సమస్త సంస్కృతి వాయువులు నా యింటిముందు వీచుగాక! కాని వాటిశక్తికి నే నెగిరిపో దిరస్కరింతును. నేను మరియొకని

యుంతు చోరునివలె చోరపడి జీవింపలేను. భిక్షుకుడనై గాని, శ్వానిసనై గాని బ్రతుకలేను.”

ఇవి మహాత్ముడు భారతదేశమునకు వచ్చిన ప్రథమ వర్షమున గావించిన మహోపన్యాసములలోని ప్రముఖాంశములు. ఈ వాక్యములలో మహాత్ముని సమరదృక్పథము సమస్తమును వ్యక్తమగుచున్నది. సమైక్య మొనర్చుకొని ప్రబలశత్రువును స్వాతంత్ర్యేచ్ఛతో, సౌభాగ్యభారత నిర్మాణమునకై సమర మొనర్ప నీవాక్యములు జాతిని ప్రేరేపించినవి. ఆ మహానుభావుని కల్మష రహితము, సత్యయుతము, భయవిరహితమునైన వాగమృతమును గ్రోలి యనతికాలమున దేశము 'సమరనేత'గ వరించినది.

ప్రథమ ప్రపంచ మహాసంగ్రామము ముగిసిపోయినది. బ్రిటిష్ ప్రభుత్వము స్వరాజ్యము నర్థించుచున్న భారతీయుల కన్నుల నీరు తుడుచుటకై ఫిబ్రవరి 1917 న మాంటేగు, ఛెమ్సుఫర్డు సంస్కరణల బ్రకటించినది. రాజప్రతినిధి యంగీకారమును బొందిన మరుక్షణమునుండి యవి వ్యవహారములోనికి వచ్చును. దేశమున నా సంస్కరణలకు వ్యతిరేకోద్యమ మారంభమైనది. మహాత్ముడు వీని కంగీకారము నీయవలదని రాజప్రతినిధిని బ్రార్థించినాడు. ప్రభుత్వ మంగీకరించినచో సత్యాగ్రహ మారంభింతునని ప్రకటించినాడు.

ఆయన సత్యాగ్రహ మొక యసమాన సాధనము. దానిని ప్రయోగించుటయందు మహాత్మునికి సాటిలేదు. అం దాయన కచంచల విశ్వాసము. అది శక్తివంతము. పవిత్రము. మాంటేగ్-ఛెమ్సుఫర్డు సంస్కరణలు వచ్చినవి. 1 మార్చి '19 న మహాత్ముడు "మేము వీనిని తిరస్కరింతు"మని ప్రభుత్వ

మును హెచ్చరించినాడు. భారతప్రజల నందులకై ప్రమాణ మును స్వీకరింపవలసినదిగా ప్రబోధించినాడు. యావద్భారత మా మహానాయకుని పిలుపు వినినది. ప్రభుత్వమున కీ నూతననాయకుని భాష క్రొత్తది. దానిని గలతపెట్టినది. మహాత్ముడు ప్రకటించిన 'హరతాళ్' [6 ఏప్రియల్ '19] జయప్రదముగ జరిగినది. దీనితో మహాత్ముని నాయకత్వమున స్వాతంత్ర్య సమరచరిత్రలో నూతనాధ్యాయ మారంభ మైనది.

గాంధిజీ ప్రథమమునుండి బ్రిటిష్‌వారికి మిత్రుడు. భారతదేశమునకు దిరిగివచ్చిన నాటినుండి ప్రపంచ మహా యుద్ధమున వారికి సాయపడు డని దేశీయప్రజల నుద్బోధించి నాడు. మాంట్ఫర్డు సంస్కరణలు రాబోవుముందు ప్రభుత్వము నకు సంస్కరణల విషయమున దోడ్పడు మని దేశమును గోరినాడు. అట్టివాడు పంజాబును రక్తస్నాన మాడించిన జలియన్‌వాలా బాగ్ హత్యలు, పంజాబు దురంతములు చూచి బ్రిటిష్ ప్రభుత్వమును 'సైతాను ప్రభుత్వ' మని ముక్తకంఠముతో బలికినాడు.

బ్రిటిష్‌ప్రభుత్వము పరుసదనము వహించుచున్న కొలది భారతజాతి గర్వ ముడుకెత్తుచున్నది. వారొనర్చుచున్న యవమానము లిక భరింపశక్యములుకావని నిశ్చయించుకొని నది. కష్టసాగరముల స్వాతంత్ర్యనౌకను నడిపింప సమర్థుడగు నావికుడు మహాత్ముడే యని తీర్మానించుకొనినది.

'20 లో కాంగ్రెసు ప్రత్యేక మహాసభ జరిగినది. దేశ మున వివిధప్రాంతములనుండి మహానాయకు లనేకులు విచ్చేసి నారు. స్వాతంత్ర్య సమరమునకై ప్రముఖతీర్మానము లొనర్ప

రని దేశము కాచుకొని కూర్చొనినది. 'సహాయ నిరాకర ణోద్యమ' తీర్మానమును ప్రవేశపెట్ట మహాత్ముడు మూర్తీభ వించిన భారతహృదయమువలె వేదికపై జేరినాడు. 'మహాత్మా గాంధీకీజై' 'ఇంక్విలాబ్-జిందాబాద్' అను వీర నినాదము లతో సభ కల్లోలిత మగుచున్నది. ఆ నా డగ్రనాయకులుగ బరిగణితులగుచున్న పాల్, బిసెంటు, జిన్నాలు మహాత్ముని కేవల మాశావాదిగను, స్వప్నవీథుల విహరించు నున్మత్తుని గను, కార్యవివేక విహీనునిగను భావించినారు.

నాగపురము కాంగ్రెసులో మహాత్ముని సహాయనిరా కరణ తీర్మానమునకు బూర్ణవిజయము చేకూరినది. మిత వాదులు, కేవల రాజతంత్రజ్ఞులు, సమరవ్యతిరేకులు కొందరు కాంగ్రెసునుండి వెడలిపోయినారు. నూతననాయకుని యడుగు జాడల నడువజైతన్యయుతులు, సమరవీరులు స్వాతంత్ర్యాభి లాషులు నయిన పండిత మోతీలాలు నెహ్రూ, దేశబంధు, చిత్తరంజనదాసు, హాకీం అజ్మలుఖాను, డాక్టరు అన్సారీ, ఆలీ సోదరులు ప్రతినలు గైకొనినారు.

"మాంటె-ఫర్డు సంస్కరణలననుసరించి రాబోవుచున్న యెన్నికలను బహిష్కరింపు" డని సత్యాగ్రహ సమరనేత మహాత్ము డాదేశించినాడు. శాసనసభలలో బ్రవేశించిప్రభుత్వ ముతో బోరాడుట కింతటితో నాయన స్వస్తి జెప్పుటలోవిజయ మొందినాడు. ప్రతిభావంతు లెవ్వరును వాటిలో బాల్గొన లేదు. శాసనసభలను, కేవల ముద్యోగప్రియులకు, బిరుద వ్యామో హితులకు, భూస్వాములకు 'జీ హుకుము' లకు వదలిపెట్టి నాడు. రాజప్రతినిధి సలహాసంఘము మేర్పాటైనది. అందలివ్యక్తు లందరును బ్రభుత్వసామ్రాజ్యతత్త్వమునకు జాళము వేయువారు.

నూతన సంస్కరణల ప్రారంభోత్సవ మొనర్ప భారతప్రభుత్వము వేల్సుయువరాజు నాహ్వానించినది. ప్రజాహృదయముల నగ్నిజ్వాలలు చెలరేగినవి. సత్యాగ్రహోద్యమమునకు నిశ్చితమైనది.

మహాత్ముని సందర్శన సంభాషణా ఫలితముగ చిత్తరంజనదాసు నాగపుర కాంగ్రెసునుండి తిరిగివచ్చిన తరువాత న్యాయవాదవృత్తికి దిలోదక మిచ్చినాడు. పూర్వము తాననుసరించు నాంగ్లో-ఇండియన్ జీవితవిధానమును మార్చుకొని కేవలమొక 'రాజకీయ సన్న్యాసి'యైనాడు. వంగదేశీయ విద్యార్థులకు కేకపెట్టినాడు. వారు కళాశాలను బహిష్కరించి బయటకు తండోపతండములుగ విచ్చేసినారు. మహాత్ముడా సందర్భమున కలకత్తా కేగి నూతన జాతీయ విద్యాలయ నిర్మాణ మొనర్చినాడు. ప్రభుత్వము జాతీయవాదులపై జేయి చేసుకొనుచున్నది.

వంగదేశమున చిత్తరంజనుడు కారాగారమున నున్నాడు. మహమ్మదాలీని ప్రభుత్వము పంజాబు కారాగారమున బంధించినది. ఆనాడు దేశమున హిందూ మహమ్మదీయ విభేదములు లేవు.

మహాత్ముని నాయకత్వమున సత్యాగ్రహ సమరము సాగుచున్నది. రాజప్రతినిధి రీడింగుప్రభువు యువరాజురాకకు దేశస్థితిగతు లనుకూలముగ లేవని గ్రహించినాడు. మానుకొనిన బ్రిటిష్ గౌరవమునకు భంగము వాటిల్లును.

17 నవంబరు '21 న యావద్భారతమున యువరాజురాకను గురించి మహాత్ముని యాదేశానుసారముగా

'హరతాళ్' జరిగినది. రీడింగుప్రభు వేమి యభాస కానున్నదో యని భయపడి జాతీయనాయకులతో సంప్రదింప నొక సభ నేర్పాటుజేయ నిశ్చయించుకొనినాడు. చిత్తరంజనునితో తంతి సంప్రదింపులు జరిపినాడు. 'మహాత్ము డంగీకరించినాడా?' యని రాజప్రతినిధిని దేశబంధువు ప్రశ్నించినాడు.

వెంటనే యతడు మహాత్ము నర్థించినాడు. మహాత్ము డంగీకరించినాడు. కాని యీ సమరనేత యుక్తిపరుడు. సభకు మౌలానా మహమ్మదాలీ వచ్చితీరవలె నని నిబంధన మేర్పాటు చేసినాడు. ఇది వంచనమని గ్రహించి రీడింగు ప్రభు వంగీకరింపలేదు.

నూతన సంస్కరణల ప్రారంభోత్సవ మొనర్ప యువ రాజు బ్రిటను నుండి వచ్చెను. జాతీయభారత మందుకు వ్యతి రేకతను బ్రకటించి యుత్సవములలో బాల్గొన విరమించినది. అతనికి నిర్జనము, నిరలంకృతమునైన ఢిల్లీ స్వాగతమిచ్చినది. క్రోధము రాజప్రతినిధిని బాధించుటచే జాతీయవాదుల తీవ్ర ముగ బ్రభుత్వము శిక్షించుచున్నది.

ఇట్టి స్థితిలో నహమ్మదాబాదున కాంగ్రెసు మహాసభ జరిగినది. గాంధిజీ సహాయ నిరాకరణ తీర్మానమును కార్య వర్గమువారిచే నొద్యోగికముగ నంగీకరింపజేసినాడు. మరి యొకమారు తన సాధనాశక్తిని బ్రభుత్వమునకు బ్రదర్శింప గృతనిశ్చయుడై సత్యాగ్రహ సమరయోధుల జేకూర్చుకొను చున్నాడు.

బొంబాయిలో గొలదికాలమునకే సర్వపక్షమహాసభ యొకటి శంకరనాయరు అధ్యక్షతన సమావేశమైనది. ప్రభుత్వ ముతో సంప్రదింపులు జరిపి సంధి యొనర్చుకొనుటకు దీర్మాన

మైనది. మహాత్ముడు మొదట 'సమరమును సాగించుటయే యుచిత'మని పలికినాడు. బ్రిటిష్‌వారితత్వ మా నాయకుని కవగత మైనట్లు మరెవ్వరికిని కాలేదు. శక్తిని జూచిగాని వారు భయపడ రని గాంధిజీ నిర్ణయము. కాని సంధిపద్ధతి కాయన వ్యతిరేకి కాడు. రాజ్యతంత్రజ్ఞత వెల్లడి యగునట్లు 'వ్యక్తిగతముగ నేనీ తీర్మానమున కంగీకరించుచున్నాను' అనిపలికినాడు.

ప్రభుత్వ మీ తీర్మానమును లెక్కబెట్టలేదు. పాశవశక్తితో భారతమును బాలింపగల మను ధైర్యము దానికణుమాత్రమును దరుగలేదు.

భారత హృదయమును జూరగొన్న మహానాయకుడు గాంధిజీ భారతముకంటె విచిత్రవ్యక్తి. తొలగద్రోసుకొని బ్రతుకువాడు కాడు. శక్తిసంపన్నుడు. తన్ను నడిపించుకొనుటయే కాదు, ఇతరులను నడిపింపగలడు. ఆయనశంఖధ్వానము వినిపించిన మరుక్షణమున యావద్భారతమును సత్యాగ్రహ సమరరంగము కాగలదు. నిరంతరము తన్ను, దేశమును, సాధనమును బరీక్షించుకొని యగణితశక్తినిసంపాదించుకొనిన మహాత్మునకు బ్రభుత్వ మన్న భయ మేమున్నది ? ఆ దేశ భక్తుడు నిజసేవా త్యాగ ధర్మములు కారణముగ కిరీటము లేని చక్రవర్తి యైనాడు.

నూతన సంస్కరణ రద్దుగావింప యత్నింపని పక్షమున 'సత్యాగ్రహ సమర మారంభించి బార్డోలీలో జట్టతిరస్కార మొనర్తు' మనియు, 'నిది ప్రజావాంఛిత' మనియును 1 ఫిబ్రవరి 1922 న రాజప్రతినిధికి దెలియపరచినాడు.

చట్టతిరస్కార మన నేమో ప్రభుత్వ మెరుగును. మహాత్ముడు పూర్వము 'చాంపరాణ్, కైరాలలో వ్యక్తిగత

ముగ దానిని ప్రదర్శించి చూపినాడు. రాజప్రతినిధి రీడింగు ప్రభువు భయపడి మహాత్ముడు సూచించిన గడువులో నొక సర్వపక్ష మహాసభ నేర్పాటుచేసి బ్రిటిష్ ప్రభుత్వ పక్షమున స్వరాజ్యమును గురించి వెనుకటిపాట పాడినాడు.

మహాత్ముడు నిజనేతృత్వమున నడిపింప దలపెట్టిన బార్డోలీ సమరారంభమునకై సమస్తదేశము నను్రిలెత్తి జూచుచున్నది. సంయుక్తరాష్ట్రములలో గోరక్‌పూరుదొద్ద చౌరీచౌరాలో కాంగ్రెసు సేవాదళ మూరేగుచుండ బ్రభుత్వ మాపినది : క్రోధోద్వేగమైన ప్రజ కొందరుద్యోగులపై బడి 'హింసాకాండ' జరిపినారు.

మహాత్ము డహింసావాది. ఆయన మతమున నది మానవ విముక్తిసాధనము. ప్రేమరూపము. చౌరీచౌరావార్త మహాత్ముని చెవిని బడినది. భరింపలేకపోయినాడు. తన యుద్ధ విధానమున కింకను గొలదికాలము బట్టునని నమ్మి బార్డోలీ యుద్యమము నాపించినాడు. కారాగారమున నున్న జవహారు వంటి మహానాయకు లిందుకు క్రుద్ధులైనారు. మహాత్ముడు తానొనర్చిన దుచితకృత్య మని వాదించినాడు. ప్రభుత్వ ముతో 'నే నోడిపోతి'నని పలికినాడు. 'అపజయము నంగీ కరింపని వ్యక్తికి విజయ మనునది కల్ల' యని మహాత్ముని సిద్ధాంతము.

అటుపిమ్మట మహాత్ముడు పత్రికాముఖమున బ్రిభుత్వ ముతో సమర మారంభించినాడు. ఆయనది పదునుగల భాష. పలుకు భావగర్భితము, అవక్రము, సత్యయుతము, భయ రహితము.

ఆయన జాతీయోద్యమ సాధనముగ 'యంగ్ ఇండియా' యను పత్రికను స్థాపించి యా పత్రికాముఖమున దేశమున కుద్బోధించుచుండెడివాడు. అందు 'నిగళ విచ్ఛేదము', 'భక్తి వితానము' మొదలైన ప్రముఖ వ్యాసముల బ్రచురించినాడను నేరమున ప్రభుత్వ మాయనపై రాజద్రోహమునకై న్యాయ స్థానమునం దభియోగము గొనివచ్చినది. న్యాయాధిపతి 'నీవు నిప్పుతో నాడుకొనుచున్నావని యెరుగుదువా?' అని గద్దించినాడు. 'ఔను నిప్పుతో నాడుకొనుచున్నా నని నే నెరుగుదును. అదే నా చిరకాంక్ష. స్వేచ్ఛగ నన్ను వదలిపెట్టిన మరియు నిట్లాడుకొందును. అది నాకర్తవ్యము. నెరవేర్పకున్న దేశమునకు దప్పినవాడ నగుదు' నని గాంధిజీ సమాధాన మొసగినాడు. ఎంతటి స్థిరచిత్తము! ఎంతటి చిత్తశుద్ధి!!

ప్రభుత్వ మామహావీర పుంగవున కారు సంవత్సరములు కారాగార శిక్షవిధించినది. కొంతకాలము మహాత్ముడు రాజకీయ రంగమునుండి యదృశ్యుడైనాడు. ఆరోగ్యమున నసంతృప్తి కలుగుటవలన బ్రభుత్వము భయపడి బాపూజీని రెండు వత్సరముల తరువాత కారాగారమునుండివిముక్తునొనర్చినది. మధ్యకాలమున కాంగ్రెసులో మరల మార్పువచ్చినది. శాసన సభలలో బ్రవేశించి ప్రభుత్వము నెదుర్కొన నిశ్చితమైనది.

మహాత్ముని మనస్తత్వమున నెట్టిమార్పును గలుగలేదు. అహింసా, సత్యాగ్రహ, నిరశనవ్రత సాధనములపై నాయనకు నమ్మకము దినదిన ప్రవర్ధమాన మగుచున్నది. సబర్మతీ ఆశ్రమమును స్థాపించి యట తన నూతన మతమున బరిపూర్ణ విజ్ఞానమును జేకూర్చుకొన దప మొనరించుచు కాలము గడుపుచున్నాడు.

'భారతీయులు స్వారాజ్యప్రదానమున కెంతవర కర్హులో బరిశీలింపవలసిన'దని బ్రిటిష్ ప్రభుత్వము సైమన్ నాయకత్వమున '27 నవంబరులో నొక 'వర్గము' నేర్పాటుజేసి భారతదేశమున కంపినది. వారితో సంప్రదించుటకు ముందుగ జాతీయ నాయకు లొక సర్వపక్ష మహాసభ నేర్పాటు జేసుకొనినారు. ఆ సందర్భముననే చారిత్రాత్మకమైన 'నెహ్రూ ప్రణాళిక' యవతరించినది.

కాంగ్రెసు మహాసభ దీని నంగీకరింపవలసి యున్నది. మోతీలాలు నెహ్రూ కలకత్తా మహాసభ(1927)లో దానిని బ్రవేశపెట్టుటకు బూనుకొనినాడు. ఆ సభలోని యభ్యుదయ వర్గమువారు శ్రీనివాస అయ్యంగారు, జవహరులాలు, సుభాస్ బాబుల నాయకత్వమున వ్యతిరేకించినారు. 'అధినివేశ స్వాతంత్ర్యమిచ్చిన జాలు' నన్న నెహ్రూ ప్రణాళికలోని యంశముతో వా రేకీభవింపలేదు. ఈ స్వాతంత్ర్యవీరులలో నిట్టి భేదాభిప్రాయములు పొడజూపుటవలన దేశమునకు బ్రమాదము; పరప్రభుత్వమున కది నూతనశక్తి.

స్వాతంత్ర్యసమరనేత గాంధిజీ యిది గుర్తించినాడు. ఇరువురకును సంధి గావించుట కర్తవ్యమని యుచితజ్ఞతతో 31 డిసెంబరు '29 లోపల ప్రభుత్వ మధినివేశ స్వాతంత్ర్యమును బ్రకటించిన స్వీకరింతుము; లేకున్న పూర్ణస్వారాజ్యవాదులు ప్రచార మొనర్చి సమరము సాగింపవచ్చు' నని యొక తీర్మానమును బ్రవేశపెట్టి విషమస్థితినుండి కాంగ్రెసు సంస్థను, దేశమును దప్పింప యత్నించినాడు.

నూతన రాజప్రతినిధి ఇర్విన్ ప్రభువు సీమకేగి బ్రిటిష్ లేబరు ప్రభుత్వముతో సంప్రదించి భారతభూమికి తిరిగివచ్చి

'భారతీయుల కధినివేశ స్వాతంత్ర్య మొసగ ప్రభుత్వము నిశ్చయించి'నట్లుగ నొక దీర్ఘప్రకటన గావించినాడు. అందెట జూచినను రాజ్యతంత్రము ద్యోతక మగుచున్నది.

మహాత్ము డాశావాది. ఢిల్లీలో సర్వపక్ష మహాసభ నొకదాని నేర్పాటు చేయించి భారతీయులు వాంఛించు 'అధినివేశ స్వాతంత్ర్య స్వరూపమును వ్యక్తమొనర్చుచు నొక తీర్మానమును వ్రాసి యందు బ్రవేశపెట్టినాడు. సర్ తేజ్ బహదూర్ సప్రూ వంటి రాజకీయవేత్త లా తీర్మానమున కనుకూలించిన పిమ్మట నాయకుడు దానిని ప్రభుత్వమున కందజేసినాడు.

రాజప్రతినిధి గృహమున 23 డిశంబరు '29 న జాతీయ నాయకులతో సంప్రదింపులు జరిగినవి. మూడు గంటలు చర్చలు సాగినవి. ఆంగ్లేయులు హిందూముస్లిములను విడదీయు టొక తంత్రముగ బెట్టుకొనినారు. సారాంశము సమస్తమును విఫలమైనది.

ఉద్రేకోల్బణ మప్రతిహతముగ నున్న సమయమున లాహోరులో కాంగ్రెసు మహాసభ జరిగినది. పండిత జవ్హారులాలు నెహూ్రు అధ్యక్షోపన్యాసమున ధైర్యసాహసముల వెదజల్లినాడు. మహాత్ముడు స్వయముగ "పరిపూర్ణ స్వారాజ్యమే కాంగ్రెసు చరమలక్ష్య" మని యుద్ఘాటించి యొక తీర్మానమును బ్రవేశపెట్టినాడు. అందు 'ఈ తీర్మానముతో నెహూ్రు రాజ్యాంగ ప్రణాళిక రద్దయినది; సమస్త సభ్యులును రాబోవు సమరమున పాల్గొన వలసిన' దని గోరినాడు.

"స్వాతంత్ర్యోద్యమ ప్రథమ సోపానముగ, నూతన సిద్ధాంతమున కనుగుణ్యముగ కేంద్ర, రాష్ట్రప్రభుత్వ శాసన సభల బహిష్కరింప వలసినదని, కాంగ్రెసు సభ్యుల నాదేశించుచున్నది. కాంగ్రెసు నిర్మాణాత్మక కార్యక్రమమును సాగింపవలసినదని యీ సంస్థ దేశమును కోరుచున్నది. అవసరమని తోచిన ప్రదేశమున 'పన్నుల నిరాకరణ' ప్రారంభించుటకు, 'చట్టతిరస్కారము'ను నడిపించుటకు అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గమున కధికార మీ ప్రజాసభ కల్పించుచున్న" దని మహాత్ముడు తీర్మానము చేయించినాడు.

రాజప్రతినిధి శాసనసభలో లాహోరు తీర్మానమును వినిన తరువాత నొక ప్రసంగ మొనర్చినాడు. మహాత్ముడు దానిపై 'కాంగ్రెసువాదిద్దైన ప్రతివ్యక్తియును నేటి సంభాషణకు రాజప్రతినిధికి నమస్కరించవలసి యున్నది. అందువలన వాతావరణము విశదమైన' దనినాడు.

యుద్ధారంభమునకు పూర్వము మహాత్ముడు సంధికై మరల నొక యత్నము చేసినాడు. పదకొండు ముఖ్యసూత్రములుగల యొక పత్రమును ప్రభుత్వమునకు బంపినాడు. అందు ముఖ్యమైనవి పరిపూర్ణ మద్యనిషేధము, భూమిపన్ను తగ్గింపు, ఉప్పుపన్ను రద్దు, ఉద్యోగి వేతనముల తగ్గింపు, స్వరక్షణమున కాయుధ ప్రదానము.

"అతి స్వల్పములు, నత్యావశ్యకములైన నీయంశముల ప్రసాదించి మమ్ము తృప్తిపరచిన రాజప్రతినిధికి 'అసహాయోద్యమము', 'సత్యాగ్రహ'మను మాటలు వినిపింపవు. అప్పుడు పరిపూర్ణ వాక్స్వాతంత్ర్యమున్న నేసభయందైనను కాంగ్రెసు పాల్గొనగల" దని మహాత్ము డాలేఖలో నిష్కర్ష జేసినాడు.

ప్రభుత్వము వీటికే సమాధానమును జెప్పలేదు. లాహోరు కాంగ్రెసు మహాసభలో సమస్తజాతికి నేకైకప్రతి నిధినలె 'పరిపూర్ణ స్వరాజ్యమే తత్క్షణ లక్ష్య' మని ముక్త కంఠముతో యావద్భారతమును, ప్రపంచమును విన గాంధిజీ పలికినాడు. స్వాతంత్ర్య దినోత్సవము వచ్చినది. కోటికంఠ ములు ప్రమాణపత్రముల స్వీకరించినవి. మహాత్ముడు శక్తిని కొలుచుకొనినాడు, సమరారంభమునకు సిద్ధపడినాడు.

30 ఫిబ్రవరి '30 న కాంగ్రెసు కార్యవర్గము అహమ్మదా బాదులో సమావేశమై మహాత్ముని సత్యాగ్రహ సమరనాయ కునిగ బట్టభద్రు నొనర్చి స్వేచ్ఛానుసారముగ యుద్ధమును సాగింపుడని కోరినది.

"కార్యవర్గతీర్మానము నాస్వేచ్ఛానుసారముగ సమర మును సాగింప ననుజ్ఞయిచ్చినది. భంగ్యంతరముగ నిది నన్ను బంధించినది. దీనినే బహుకాలమునుండి నే వెదకుచున్నాను. వ్యక్తిగతముగ నాకీతీర్మానము రాజకీయ మనుటకంటె మత విషయకము. ...ఇతఃపూర్వ మెన్నడును నే నిట్టి కార్య భారము వహింపలేదు. అట్టిస్థితి యేర్పడక పోవుటయే యిందుకు కారణము. నన్ను నడిపించునది 'అహింస' యైన సమస్తమును సంపన్నము కాగలదు. నా చట్టతిరస్కారము ప్రేమాభ్యర్థనము. అది ప్రమాదకరమైనది. కాని చుట్టుకొని యున్న హింసకంటె ప్రమాదకారి కాదు. చట్టతిరస్కార ముతో బాటు — వెన్నాడు హింసయున్న దెసనుండి ప్రమా దము కలుగవచ్చును. అది యే దిక్కునుండి వచ్చినను బార్డొలీ వలె వెనుబాటు లేదు. తుది ప్రాణీవరకును సమరము సాగి

పోవలసినదే. ఇంతకుమించి మానవు డొనర్పగలిగిన దేమియు లే"దని గాంధిజీ లోకము విన నుద్యమారంభవేళ ననినాడు.

మహాత్ముడు కేవలము యోధుడు కాడు; రాజనీతిజ్ఞుడు. ప్రపంచదృష్టిలో ప్రభుత్వమును గించపరచుటవలన నైతిక బలము చేకూరు నని యీ మహానాయకుని నమ్మకము. అది యాయన రాజనీతి! మరల నొక యత్న మొనరించిన నెట్లుండును?

రాజప్రతినిధికి సమస్తమును విస్తరించి గాంధిజీ యొక లేఖ వ్రాసినాడు. అతడు ముక్తసరిగ "న్యాయవిరుద్ధమును, ప్రజాశాంతికి భంగకరమునైన మార్గము నవలంబింప మీరు నిశ్చయించినందుకు నేను చింతించుచున్నా"నని సమాధానము నంపినాడు.

"ప్రభుత్వ పదదళిత భారతమున న్యాయము, ప్రశాంతి యెట నున్న?" దని గాంధిజీ యనుకొనినాడు.

మహాత్ముడు సత్యప్రియుడు. తంత్రజ్ఞుల దలక్రిందు జేయగల మేధాశక్తి యాయన కున్నది. స్వచ్ఛంద హృదయముతో లోకమెల్ల మెచ్చుకొన భయరహితుడై యిట్లు సమాధాన మిచ్చినాడు.

"వినమ్రుడనై నేను రొట్టె నిమ్మని ప్రభుత్వమును ప్రార్థించినాను. ప్రతిగ నాకొక పాషాణము లభించినది. రాజప్రతినిధి సమాధానము నా కాశ్చర్యము కలిగింపలేదు. నా లేఖలోని వాక్యముల నక్షరశః జరిగించి తీరుదును. న్యాయవిరుద్ధము, ప్రజాశాంతికి భంగకరము నైన మార్గమును నే నూహించినమాట వాస్తవమే.

"నేడు భారతమందున్న న్యాయము బ్రిటిష్ ఉద్యోగుల యిచ్ఛతప్ప వేరేమున్నది? దేశ మెరిగిన శాంతి కారాగార ప్రశాంతి. నేడు భారత మెల్ల నొక విశాల కారాగారము. నే నీ న్యాయమును దిరస్కరింతురు; ఈ ప్రశాంతిని భగ్న మొనర్తును.

"స్వేచ్ఛకై నేడు భారతదేశ ముక్కిరిబిక్కిరి యగుచున్నది. దానికి క్రమోచ్ఛ్వాస, నిశ్వాసముల నొడగూర్చుటకై దుఃఖ భూయిష్ఠమగు నీ నిర్బంధ శాంతిని భగ్నమొనర్పక తప్పదు. ఇదే నా పవిత్ర కర్తవ్యమని నే భావింతును."

సోదర సత్యాగ్రహ సమరవీరుల నుద్దేశించి సమరనేత గాంధిజీ "మన యాదర్శము బలయుతము; విధానము పునీతము. సత్యమును పరిత్యజింపనంత వరకు సత్యాగ్రహుల కపజయము లేదు. రే పారంభము కానున్న మన సమరము విజయవంత మగుటకు భగవానుని వేడుకొను చున్నా" నని సబర్మతీ యాశ్రమమునుండి సందేశ మిచ్చినాడు.

12 మార్చి విజయమో, మృత్యువో! సూర్యోదయారంభ వేళ సబర్మతీ యాశ్రమమునుండి 'దండయాత్ర' మహాత్ముడు ప్రారంభించినాడు. శాకలు దీరిన నూతన కదన యోధులు కొందరు సత్యాగ్రహు లాయన వెనుక నడుచుచున్నారు. 'మహాత్మాగాంధికీ జై' నినాదములతో నొక మహాజనసముద్ర మాయన వెనుక మహోత్సాహముతో ననుసరించుచున్నది.

మహాత్ముడు డెబ్బదిలొమ్మిదిమంది సమరసైనికులతో నస్లి, బరేజా, నవగ్రాం, వస్న, మతర్, నాడియడ్, బొరైలి,

దభఙ్గ, ఆనంద్ ల మీదుగ 18 మార్చినాడు బోర్సద్ చేరి నాడు. ప్రతిగ్రామమునందును ప్రజలా మహాత్మాయకు నఖండ స్వాగతవాక్యములతో నాహ్వానించినారు. గాంధిజీ సేవా, ధన సహాయ మర్థించినాడు. ఊహకు మించి యవి లభించినవి. ఆయన సేవలో నున్న క్రమశిక్షణము మున్నెన్నడును కని విని యెరిగినది కాదు.

6 ఏప్రియలు '30 ఉదయము 8-30 గంటలకు మహాత్ముడు సత్యాగ్రహసైన్యముతో కలసి ఉప్పుచట్టముల ధిక్కరించినాడు. ఒక మృణ్మయపాత్రతో సహజ లవణమును గ్రహించి యట "ఉప్పుచట్టము ననుసరించి ప్రభుత్వ మిచ్చు శిక్షణను ధిక్కరింపగల ప్రతివ్యక్తియును యిచ్చ వచ్చినప్రదేశమున స్వేచ్ఛగ నుప్పుచేసుకొన వచ్చు"నని ప్రకటించినాడు.

అర్ధ నిశాసమయమున మహాత్ముడు కరాలీ కాంగ్రెసు శిబిరములో నిద్రించుసమయమున ప్రభుత్వ మాయనను బంధీ నొనర్చి ఎర్రవాడ కారాగారమునకు దీసుకొని పోయినారు. అంతటితో సమస్తము సమసిపోవునని ప్రభుత్వము తలచినది.

యావద్భారతమున చట్టతిరస్కారములు జరిగినవి. ప్రతి రాష్ట్రమునను కాంగ్రెసు శిబిరములపై ప్రభుత్వోద్యోగులు ముట్టడులు సాగించినారు. నాయకులు, సేవాదళములు లాఠీ చార్జీలకు, కారాగృహ నిర్బంధములకు గురియైనారు. ప్రముఖ నాయకులైన వల్లభాయి, జవహారు ప్రభృతులు జైళ్ళలో మ్రగ్గుచున్నారు, అయినను ప్రజల యుద్రేకము తరుగలేదు. స్త్రీ, బాల, వృద్ధ భేదములు లేక సమస్తవర్గములవారును మహాత్ముని యడుగుజాడల నచంచల విశ్వాసముతో నడచినారు.

ఆసేతు హిమాచలపర్యంతభారతమున నుప్పుచట్టముల దిరస్కరించుటతో బాటు విదేశవస్త్ర బహిష్కరణము, మద్యపాన నిరోధములు సాగినవి. లక్షలాది గ్రామములు గార్చిచ్చువలె బ్రజ్వరిల్లి ప్రభుత్వ భవనముల దహింప దలకొన్న యుద్యమమును రూపుమాపుటకు బ్రభుత్వము సమస్తశక్తుల వినియోగించినది. దౌర్జన్యమునకు బూనుకొనినది.

ఎఱ్ఱవాడజైలులో నున్నను మహాత్ముని మూర్తియే సమరము సాగించుచున్నది. ప్రతిగ్రామ మొక యుద్ధరంగమైనది. అయిదు నెలలు సత్యాగ్రహ సమరము సాగినది.

మహాత్ముడు స్వాతంత్ర్య గురుదేవుడై యర్జునులవంటి మహాయోధులను, కృష్ణభగవానుని వంటి రాజనీతిజ్ఞులను సృష్టింపగలిగినాడు. ఇది సమస్తమును మహాత్ముని విజయము! నిరుపమాన విజయము !!

కారాగారమున నున్నపుడు విదేశ పత్రికా విలేఖరులాయనను దర్శింపవచ్చినారు. వారితో 'నేనైనను నేనుసంధికి సంసిద్ధుడనే' యని మహాత్ముడు వాక్రుచ్చినాడు. వారా మహాత్ముని యాత్మబలమునకు, సత్యప్రియత్వమునకు, నిరుపమాన త్యాగమునకు ముగ్ధులై 'కారాగారమున బద్ధుడైన మహాత్ముడు భారతీయమానతారమూర్తి. ఈనాడైన ప్రభుత్వమాయనతో సంధిగావించుకొనుట ప్రభుత్వమునకును, బ్రపంచమునకును లాభదాయక'మని యుద్ఘోషించినారు.

సత్యాగ్రహ సమరమున మహాత్ముడు ఝళిపించిన 'మెత్తనికత్తి' బ్రిటను హృదయాంతరాళమున బొడిచినది. ఆర్థికబహిష్కరణముతో బ్రిటిష్‌వర్తకము దెబ్బతినినది.

'ఖద్దరు' వ్యాపనముతో లాంక్‌షైర్ కార్మికులు కడగండ్ల పాలైనారు. ప్రభుత్వమునకు లొంగక తప్పినది కాదు. విప్లవ నేత మహాత్మునితో ప్రభుత్వము స్నేహపూర్వకముగ సంధి యత్నము లారంభించినది. తత్ఫలితమే 12 నవంబరు '38 నాటి రెండవ రౌండుటేబిల్ సమావేశము.

గాంధిజీ యాశయసిద్ధి యాసమావేశమువలన జేకూరలేదు. అఖిలభారత జాతీయకాంగ్రెసున కైకైక ప్రతినిధిగనా సమావేశమున భారతదేశ స్థితిగతులు సామాన్యబ్రిటిష్ ప్రజలు విన, ప్రపంచము విన బలుకుట కవకాశము లభించినది. గాంధిజీ మృదులవక్తృత్వము, సముచిత పరిహాసము, నచంచల విశ్వాసము, సత్య వాక్ప్రియత్వము—ఇన్ని మాటలేల ? నామహామూర్తి దివ్యత్వము ప్రపంచదృష్టిని భారత దేశముపై కేంద్రీకరించినది.

సమావేశాంతమున మితవాద పక్షనాయకుడు సర్ తేజ్ బహదూర్ సప్రూ 'భారతదేశమున శాంతియుత వాతావరణమును గల్పించి రాజకీయరంగమును జక్కదిద్దు కొనుట కవకాశమి'మ్మని బ్రిటిష్ ప్రధానమంత్రి మేక్డోనాల్డును వేడుకొనినాడు. తత్ఫలితముగ ప్రభుత్వము కాంగ్రెసు కార్యవర్గసభ్యులను 25 జనవరి '31 న విడుదల జేసినది. మిత వాదులు కొందరు మహాత్ముని దర్శించి కాంగ్రెసు ప్రభుత్వముల మధ్య సంధిప్రయత్నము లొనర్చినారు.

గాంధిజీ రాజప్రతినిధి ఇర్విన్‌ను జూడగోరినాడు. పక్షము దినములు సుదీర్ఘములుగ సంభాషణలు సాగినవి. 'గాంధీ—ఇర్విన్' సంధి జరిగినది. మహాత్ముడు సత్యాగ్రహ సమర మాపినాడు.

కాలచక్రము పరిభ్రమించుచున్నది. మహాత్ముని సుదీర్ఘ సమరవిధాన ముప్పొంగెడు ఉడుకురక్తముగల యువకలోకము నకు సంతృప్తి గలిగించుటలేదు. కార్మికలోకమును మేల్కొల్పిన కాంగ్రెసు సంస్థను ధనికవర్గసంస్థ యని వారు నిందింప నారంభించినారు. వారిలో చైతన్యము సముజ్జ్వలమై పొడకట్టు చున్నది.

28 మార్చి '31 న కరాచీ కాంగ్రెసు సమావేశములో 'గాంధీ—ఇర్విన్' సంధిషరతులను విమర్శించి వ్యతిరేకించి నారు. అధ్యక్షుడు వల్లభాయిపటేల్ 'నేను కర్షకాధ్యక్షుడ'నని ప్రకటించినాడు. మహాత్ముడు 'ధనికవాది'యను నిందను భరింప లేకపోయినాడు. భవిష్య త్స్వరాజ్యమున సర్వమానవుల ప్రాథమికహక్కుల నుద్ఘాటించుచు కొన్ని తీర్మానముల ప్రవేశపెట్టి వారిని శాంతపరచినాడు.

కరాచీ కాంగ్రెసునుండి తిరిగివచ్చి నాయకులు సత్యాగ్రహ సమరమున శాంతిరంగమగు నిర్మాణకార్యక్రమమునకు బూనుకొనినారు. మద్యనిషేధము, విదేశవస్తు వస్త్రబహిష్కారణము దేశమున దీవ్రతరముగ సాగుచున్నవి. వివిధరాష్ట్ర ప్రజలు గాంధి – ఇర్విన్ సంధి షరతుల పాటించి మహాత్ముని యాజ్ఞానుసారముగ చట్టసమ్మతముగ బ్రవర్తించుచున్నారు. ప్రభుత్వపక్షమునుండి సంధి కనేక వ్యతిక్రమములు జరుగు చున్నవి. "మీా ఆంగ్లేయప్రభుత్వ నైతికబల మింతేనా?"యని మహాత్ము డుచ్చైస్స్వనముగ గర్జించినాడు.

తత్కారణముగ నూతన రాజప్రతినిధి వెల్లింగ్టన్ – గాంధీజీ మరల నొక సంధి గావించుకొనినారు. పిమ్మట నొక 'రౌండ్ టేబిల్ సమావేశము' బ్రిటిష్‌ప్రభుత్వవాంఛ నను

సరించి జరిగినది. అదియును భారతీయప్రజలకు బ్రయోజనకారి కాలేదు. కాని శాంతియుతముగ పాలన మొనర్తుమని మహాత్ముడు వాగ్దానమును గైకొని లండను నుండి తిరిగి వచ్చినాడు.

లండనులో బ్రభుత్వము చెప్పిన దొకటి; భారతమున ననుసరించుచున్న విధాన మొకటి. వంగ, సంయుక్త రాష్ట్రములలో నది దురంతములకు బూనినది. నిత్యమును వాయవ్య సరిహద్దు రాష్ట్రమున కాల్పులతో బ్రజల విప్లవమునకు పురికొల్పుచున్నది. ప్రముఖనాయకుల నందర ననతికాలములో గారాగారముల బంధించినది.

మహాత్ముడు 'బ్రిటిష్ ప్రభుత్వము భారత దేశమునకు స్వేచ్ఛను బ్రసాదింప దలపలే'దని నిశ్చయ మొనర్చుకొనినాడు. మరల నొకమారు జాతిశక్తిని బ్రదర్శింపక తప్పదని తలపోసినాడు. 'ఈప్రభుత్వాచర్యలన్నిటి తాత్పర్యము మన మధ్య సుహృద్భావము లుప్తమైన దనియేనా? భవిష్యత్కాలమున వ్యవహరింపవలసిన విధానమునుగూర్చి కాంగ్రెసుకు నాసలహా నిచ్చుటకుముందు మిమ్ము కలుసుకొనన మనినారా?' యని రాజప్రతినిధికి తంతివార్త నంపినాడు.

సమాధానము వచ్చినది. ప్రభుత్వము 'నా విధానమున నెట్టిలోపము లే'దని సమర్థించుకొనినది. కాంగ్రెసు అగ్రనాయకులను నిందించినది. 'విప్లవాంతమును జూచిగాని విశ్రమింప' నని బెదరించినది. గత సత్యాగ్రహసమరము 4 మార్చి '31 తో నంతమైనది. శాంతిసమయమున నది సర్వవిధముల సత్యాగ్రహ సమరయోధుల నెదుర్కొనన సన్నాహము లొనర్చుకొని తానే కాలుద్రువ్వి కయ్యమున కాహ్వానించినది.

'30 లో జరిగిన సమరమున గుజరాత్ లోని గ్రామములు ప్రభుత్వ దౌర్జన్యములకు విశేషముగ గురియైనవి. గాంధిజీ ప్రియానుచరుడగు వల్లభాయితో నా గ్రామములకేగి ప్రజల నాశ్వాసించి రావలెనని తలపెట్టినాడు. నేడో రేపో వారు బయలుదేరవలసి యున్నది. ప్రభుత్వము వారిరువుర నిర్బంధించి కారాగారమునకు జేర్చినది.

ప్రియనాయకుల నిర్బంధ వార్తలు భారతదేశము నలుదెసల జేరుకొనిన మరుక్షణముననే సమరారంభమైనది. తీవ్రతాపమున నెదుర్కొని యోధవరుల ప్రభుత్వము శిక్షించుచున్నది.

బ్రిటిష్ ప్రధానమంత్రి మాక్డోనాల్డు కుటిల రాజనీతి నిష్ణాతుడు. మతకలహ బీజముల ప్రభుత్వము దేశమున పూర్వమే నాటినది. అవి నేడంకురించినవి. వాటి నండచేసుకొని మత ప్రాతినిధ్య సూత్రమును బ్రయోగించి సమర సైనికుల విడదీసి విప్లవమును రూపుమాపనెంచి యితడు 17 ఆగష్టు '32 న 'కమ్యూనల్ ఎవార్డు'ను బ్రయోగించినాడు. దీనికి మహాత్ముడు వ్యతిరేకింపక మానడు. 'మీకు స్వపరిపాలన మొసగు వేళ మీ నాయకుడే యడ్డుపడుచున్నా' డని చెప్పవచ్చునని యతడు భావించినాడు. శాసనసభలలో నిమ్న జాతులకు ప్రత్యేకస్థానముల గల్పించినాడు. 'విభజించుచు పాలించు' నీ బ్రిటిష్ రాజనీతిని మహాత్ముడు కనిపెట్టినాడు.

గాంధిజీ సెప్టెంబరు 22 నుండి దీనిని ధిక్కరించుచు నామరణాంత 'ముపవాసదీక్ష' స్వీకరింప నిశ్చయించినట్లు ప్రభుత్వమున కెరుకపరచినాడు. ఈ నిరశనవ్రత మహాస్త్రముతో బ్రపంచము సమస్తమును కలతపడినది. తీవ్రముగ

బ్రిటిష్‌ప్రభుత్వచర్యను ఖండించినది. బ్రిటిషు ప్రధానమంత్రి నిజ నిశ్చయమును మార్చుకొనక తప్పినదికాదు.

హరిజనోద్ధరణ వ్యాప్తికి సేవాదళమును వృద్ధిచేయుటకై మహాత్ముడుబహుకాలమునుండి కృషి చేయుచున్నాడు. అయినను కావలసి యున్న సేవకులు లభింపలేదు. దానికిని, హృదయమాలిన్య క్షాళనార్థమును గాంధిజీ యిరువదియొక్క దినములు నిరశనవ్రతదీక్ష నారంభించినాడు. దీక్షారంభ ప్రథమ దివసముననే ప్రభుత్వ మాయనను కారాగారము నుండివిముక్తు నొనర్చినది. మహాత్ముడు కొంతకాలము సత్యాగ్రహసమర మాపినాడు.

నిగ్గుదేరిన సమరయోధబలమును సేకరించుకొని మరల మహాత్ముడు వారికి వ్యక్తిసత్యాగ్రహ మహామంత్ర ముప దేశించి 30 ఆగష్టు 1 న రాస్ గ్రామమునకు యాత్రకై బయలుదేరువేళ బ్రభుత్వ మాయనను బంధించినది. నాలుగు దినముల తరువాత నెర్రవాడ గ్రామమును దాటి పూనా నగరమున నివసింపవలసిన దని శాసించినది. మరుక్షణముననే మహాత్ము డాశాసనమును ధిక్కరించినాడు. తిరిగి బంధించి ప్రభుత్వ మొక సంవత్సరము గాంధిజీకి కారాగారవాస శిక్ష జెప్పినది.

నాయకుని యాదేశానుసారముగ కాంగ్రెసు సేవకు లొకరి వెంట నొకరు వ్యక్తిసత్యాగ్రహ మారంభించినారు. సమస్త కారాగారములును గాంధిసేనలతో నిండిపోయినవి. దౌర్జన్యముతో నెంత యెదుర్కొనయత్నించినను బ్రభుత్వము పొంగిపొరలి పైబడుచున్న చైతన్య మహాసముద్రముల నాప లేక పోవుచున్నది.

ప్రభుత్వమును దల్లడిలజేయ మహాత్ముడు జైలులో నిరశనదీక్షా మహాస్త్రమును ప్రయోగించినాడు. ప్రభుత్వము చలింపలేదు. మహాత్ముని శరీరస్థితి సీరసించినది. ప్రభుత్వోద్యోగులు శ్రద్ధవహించి యాయనను పూనా వైద్యశాలకు జేర్చినారు. ప్రాణభయకారణముగ ప్రపంచమున గగ్గోలు ప్రారంభమైనది. ప్రభుత్వము మహాత్ముని 23 ఆగష్టున విడుదలచేసినది. సత్యాగ్రహ సమరనేత కిది మరియొక విజయము.

'34 లో కాంగ్రెసులో మార్పువచ్చినది. సత్యాగ్రహ సమరవిధానము మాని తాత్కాలికముగ శాసనసభా ప్రవేశ మొనర్ప నిశ్చయమైనది. అది విని ప్రభుత్వముతో సహకరింప నిచ్ఛగించినా రను నమ్మకముతో నది కాంగ్రెసుపై నిషేధము తొలగించినది.

'35 లో రాజ్యాంగచట్టమును సిద్ధమొనర్చి ప్రభుత్వము దానిని '37 లో నమలుకు కొనివచ్చినారు. ఎన్నికలు జరిగినవి. కాంగ్రెసు పాల్గొనినది. అఖండ విజయము చేకూరినది. నిత్య వ్యవహారములలో గవర్నర్లు జోక్యము కలిగించుకొన మని వాగ్దాన మొనర్చిన పక్షమున మంత్రివర్గముల నేర్పాటు గావింతు మనినారు. ప్రభుత్వాంగీకారముతో కాంగ్రెసు మంత్రివర్గము లేర్పాటైనవి. ప్రభుత్వము నడచుచున్నది.

ద్వితీయ ప్రపంచమహాయుద్ధ మారంభమైనది. ప్రభుత్వము భారతదేశమును యుద్ధమున దింప యత్నించుచున్నది. మహాత్ముడు గమనించినాడు. "ప్రజాభీష్టము లేక భారతమును యుద్ధములోనికి దింపరాదు' 'యుద్ధము-శాంతి' రెంటిని నిర్ణయింప ప్రజలు శక్తివంతు" లని సబర్మతీ యాశ్రమమునుండి గర్జించి పలికినాడు. ప్రభుత్వము కాంగ్రెసును యుద్ధసహాయ

మర్ధించినది. కాంగ్రెసు కార్యవర్గము సమావేశమై నాయకుని పలుకున కనుగుణ్యాముగ నిట్లు పలికినది :

"మీకు సాయమొనర్ప సర్వదా సంసిద్ధులము. కాని యొక మహోన్నతాశయమునకై పోరాడు సమయమున సరి సమానుల మధ్యనే సహకారము లభింపగలదు. ప్రజలు మహాత్ముని నాయకత్వమున స్వాతంత్ర్యమును సంపాదింప మహోన్నత త్యాగము లొనర్చినారు. వారు సర్వదా ప్రజా ప్రభుత్వమును, స్వేచ్ఛను కాంక్షింతురు. మీరొనర్చు యుద్ధము సామ్రాజ్యవాదులవలన రాజ్యముల రక్షణార్థమైనచో దానితో భారతీయ ప్రజ కెట్టి సంబంధమును లేదు. భారత దేశమునకు స్వాతంత్ర్యమును ప్రకటింపుడు. మీకు సమస్త సహకారమును లభించును."

సమాధానముగ "యుద్ధానంతరము సర్వపక్షముల తోను, సమస్తవర్గములతోను, సంస్థాన ప్రభుత్వవర్గములతోను సంప్రదించి '35 ఇండియా చట్టమున నవసరమగు మార్పుల చేతు" మని రాజప్రతినిధి లిన్లిత్ గో యతిబాగరూకతతో నొక ప్రకటన గావించినాడు. అంతట మహాత్ముని సత్యా గ్రహము అవతరించినది.

ఆయన "బ్రిటిష్ ప్రభుత్వ మాపగలిగినంత వరకును భారతమునకుప్రజాప్రభుత్వము కల్ల" అని వ్యాఖ్యానించినాడు. ప్రజాప్రభుత్వమును పొందవలె నన్న ప్రభుత్వము నెదుర్కొని దాని శక్తిని క్షీణింపజేయుటయే కర్తవ్య మని మహాత్ముని భావము. కాంగ్రెసు కార్యవర్గముచే గాంధీజీ 'ఇది కేవలము సామ్రాజ్య తత్వము. మీతో యుద్ధమున సహకరింప' మని తీర్మానము చేయించినాడు. యుద్ధవిషయమున బ్రిటిష్ ప్రభుత్వ

మున కెట్టి సహకారము నీయవల దని మంత్రివర్గములకు తాఖీదు లందజేయించినాడు.

ప్రభుత్వమునకు కాంగ్రెసునకును బెడిసినది. కాంగ్రెసు మంత్రులు పదవులకు రాజీనామా లిచ్చినారు.

మహాత్ముడు సమర మొనర్చు చున్నను బ్రిటిషు వారి సుహృద్భావమును లుప్త మొనర్చుకొనలేదు; మైత్రి సూత్ర మును ఛేదింపలేదు. ఇట్టి క్లిష్టస్థితియందును "బ్రిటన్ వినాశన మున మేము స్వాతంత్ర్యమును గోర" మని ఘంటాపథముగ పలికినాడు. 7 జులై '40 న భారత స్వాతంత్ర్యమును బ్రక టించి కేంద్రమున 'తాత్కాలిక జాతీయ ప్రభుత్వము' నేర్పాటు జేయించిన తా మేనాడైన యుద్ధమున బ్రిటన్‌తో సహకరించుటకు సిద్ధముగ నున్నా మని కార్యవర్గముచే బలి కించినాడు. యుద్ధాగ్నుల మధ్య దహించుకొనిపోవుచున్న బ్రిటిష్ ప్రభుత్వమున కిందులో కొంత శీతలత్వము ద్యోతక మైనది. రాజప్రతినిధిని బిలిపించి సంప్రదించి బ్రిటిషు యుద్ధ కాల ప్రధానమంత్రి చర్చిల్ అతనిచే 8 ఆగష్టు '40 న నొక నూతన ప్రకటన జేయించినాడు.

గాంధిజీ సునిశిత బుద్ధితో నా ప్రకటనను బరిశీలించి 'బ్రిటన్ నిరూపించు స్వతంత్ర భారతమునకును, కాంగ్రెసు నిరూపించు స్వేచ్ఛా భారతమునకును మధ్య నొక యఖాత మున్నది. రాజప్రతినిధి ప్రకటనతో నది విస్తరించిన' దని యొక మహావాక్యమును బలికినాడు. సమరనేత భావము సమస్త భారతమున కవగత మైనది.

భారతమునకు యుద్ధాగమనము మహాత్ముని సంచలింప జేసినది. నూతన పరిణామమున సత్యాగ్రహ సమర విధాన

మె ట్లనుగుణ మగునో గాంధిజీకి బోధపడలేదు. ఆయన యనుచరులలోనే ప్రముఖులైన కాంగ్రెసువాదులు దానిని వ్యతిరేకించుచున్నారు. సాయుధబలముల నెదుర్కొన సత్యాగ్రహ సమరవీరులు సమర్థులు కారని వారి వాదము. గాంధిజీ కెవ్విధమైన హింసాత్మక చర్య లన్న నిష్టములేదు. కాని కాంగ్రెసునకు స్వయంనిర్ణయ మొనరించుకొన ననుజ్ఞయిచ్చి నాడు. ఇతరు లెట్టి తీర్మాన మొనర్చినను సమర నేత గాంధిజీ యిష్టమే భారతప్రజానీకమున కభీష్టము.

ఆ క్లిష్టస్థితిలో గార్యరహితతను మహాత్ముడుసహింపలేక పోయినాడు; రచనలు సాగించినాడు. అవి దేశమునకు నూతన చైతన్యమును బ్రసాదించినవి. 'కేవల వాక్స్వాతంత్ర్యమున కైనను నాయకత్వము వహించి సత్యాగ్రహ సమరమును సాగింపు' డని యనుచరులు మహాత్ముని వేడికొనినారు. ముందు వెనుక లాలోచించి ప్రజోద్యమ మారంభించుట క్షేమకరము కాదని మహాత్ముడు నిర్ణయించి 'మే మొనర్చు సమరము కేవలము బ్రిటిష్ ప్రభుత్వముపట్ల నైతిక వ్యతిరేక భావమును బ్రకటించుటయే' యని వ్యక్తి సత్యాగ్రహ మారంభించినాడు.

ప్రభుత్వము బ్రిటిష్ మంత్రి వర్గములోని క్రిప్సును భారత దేశమునకు రాయబారిగ నంపినది. అతడు '42 మార్చి నెలలో భారత దేశమునకు వచ్చి సంప్రదింపులు విఫలము లగుట వలన నేప్రియలు నెలలో నింగ్లండు చేరినారు. అతని మూలమున నైనను ప్రభుత్వము యుద్ధానంతరము భారత దేశమునకు బ్రజాస్వామికమును బ్రకటింప యత్నింతుమని వాగ్దానము మాత్రమే యొనర్చినది. మహాత్ముడు క్రిప్సు ప్రతిపాద

నను "ముందుతారీఖువేసి దివాలాతీయనున్న బ్యాంకుపైనిచ్చిన చెక్కు" అని ముక్తసరిగ నొకమాటతో పరిహాసించినాడు. కాంగ్రెసు అధ్యక్షుడు అజాద్ "ఇట్టి ప్రతిపాదనలకు కాంగ్రెసు అంగీకరింప నేర"దని విస్పష్టముగ మహాత్ముని వాక్యముల కనుగుణముగ పలికినాడు.

క్రిప్సు దేశము నుద్వేగములో ముంచి వెడలిపోయినాడు. ఒక వంకనుండి బర్మారంగమున నవిజేయులై జపాను వారు భారతముపై బడ వచ్చుచున్నారు. ఇట్టి స్థితిలోనైన ప్రభుత్వవిధానమును వ్యతిరేకింపక తప్పదని మహాత్ముడు నిశ్చయించినాడు.

సబర్మతీ యాశ్రమమున కొంతకాలము నిశ్చలమానసముతో తపస్సుసాగించినాడు. ఒక 'నూతనతారకమంత్రము'ను దర్శించినాడు. అప్రయత్నముగ నా మహానాయకుని నోట 'ఇండియాను విడిచిపొం'డను మహావాక్య ముద్భవించినది.

8 ఆగష్టు '42 న కాంగ్రెసుచే 'ఇండియాను విడిచిపొం' డను తీర్మానమును చేయించిప్రభుత్వమున కందజేసినాడు. జాతీయభారతమున నది నూతన యుద్ధనినాదమైనది. ఈ తీర్మానము ననుసరించి బ్రిటిష్ వారు తక్షణమే భారతప్రభుత్వమును పరిత్యజించి వైదొలగనిచో నాయకత్వము వహించి 'యావద్భారతమును సమర రంగము గావించి యహింసా శక్తితో నెదుర్కొనక తప్ప' దని గాంధీజీ ఉద్ఘాటించినాడు. 'తీర్మానమున పరదేశీయులపట్ల నాచరణలో ద్వేషమున కేమాత్రము ఆస్కారములేదు. వీరు పరదేశీయులన్న భయమున్ననే ద్వేషమునకు దావున్నది. ఆ భయము లేనినాడు ద్వేషమే లేదు' అని తీర్మానమును సమరనేత సమరసభావముతో వివరించినాడు.

"భారతము కొరకును, సంయుక్త రాష్ట్రముల క్షేమము కొరకును బ్రిటిష్ రాజ్యపాలన మంతమొందు టావశ్యకము. ఆ పాలనము నింకను కొనసాగించుట భారతమును శక్తివిహీన మొనర్చుట. మా దేశాభ్యుదయము నరికట్టుట స్వరక్షణకును ప్రపంచస్వేచ్ఛకును, భారతజాతి సహాయపడ నేరని స్థితిని కల్పించుట" అని మహాత్ముడు కాంగ్రెసు కార్యవర్గముచే దీప్రముగు తీర్మానమును జేయించినాడు.

'విడిచిపోం' డను తీర్మాన మెంత సాహసోపేతము! అందును యుద్ధసమయమున! సంప్రదింపుల కవకాశము లేదు. ప్రభుత్వము మండిపడినది. మహాత్ముని, కాంగ్రెసు కార్యవర్గమును, నితర ప్రముఖనాయకుల బందీల నొనర్చినది. కేంద్ర, రాష్ట్ర, పట్టణ, గ్రామ కాంగ్రెసుసంస్థల రాజద్రోహసంస్థలుగ నిషేధించినది. ప్రచండములగు శిక్షలపాల్జేయ సిద్ధపడినది.

నాయకుల కారాగార నిర్బంధముతో దేశ ముద్రిక్తమైనది. యావద్భారతమున విప్లవము చెలరేగినది. హింసాత్మకచర్యలారంభించినవి. సాయుధబలములతో కొందరు వీరుల సైనికోద్యోగు లెదుర్కొనినారు. సమస్తవిధముల ప్రభుత్వమును తారుమారొనరింప యత్నించినారు. వారు తరలి మార్గముల విచ్ఛేదించి, తపాలాఫీసుల దహించి, రైలు మార్గముల నెదుర్కొనినారు.

"భారతమున జరుగుచున్న హింసా ప్రతిహింసల కే మాత్రము నేను బాధ్యుడను కా"నని విస్పష్టముగ గాంధిజీ ప్రకటించినాడు. అది 'విడిచిపోం' డను తీర్మానమును నిరాకరించి నాయకుల బందీలొనర్ప నుద్రిక్తపరవశులైన ప్రజ

లొనర్చిన యున్మ త్తకృత్యములు కాని సత్యాగ్రహ సమర నేత యాజ్ఞానుసార మనుయాయు లొనర్చిన సమరము కాదు.

'మహాత్ముని విడుదలయొనర్పు' డని వర్గ, మత వైష మ్యము లెల్ల మాని సమస్తభారతమును ప్రభుత్వము నేకకంఠ మున వాంఛించినది. వారు పెడచెవి బెట్టినారు. తత్కారణ ముగ రాజప్రతినిధి, కార్యవర్గ సభ్యులెల్లరును రాజీనామా లిచ్చినారు. ఇది మహాత్మునకు వినూతన విజయము.

'విడిచిపొం' డను మహాత్ముని శాసనమునకు భిన్న ముగ ముస్లింలీగ్ అధ్యక్షుడు జిన్నా 'విభజించి – విడిచిపొం' డని పట్టుబట్టినాడు. నూతన రాజప్రతినిధి వేవెల్ 'రాజకీయ ముగ నార్థికముగ భారత మేకైకము, అవిభాజ్య' మని యును, దాని భౌగోళికస్థితిని మార్చ వీలులే దనియును ప్రక టించినాడు.

గాంధిజీ చెరసాలనుండి విముక్తుడైన తక్షణమే జిన్నాతో 'భేటీలు' జరిపినాడు. సఖ్యము కలుగలేదు. 'మీలో మీ కభిప్రాయ భేదము లున్న స్వాతంత్ర్యము నిచ్చు టెట్లని బ్రిటన్ మరల పాతపాట పాడినది. ప్రభుత్వ మేర్పాటుచేసిన సిమ్లా సమావేశమును నిష్ప్రయోజన మైనది.

1945 – '46 లో క్రొత్త యెన్నికలు జరిగినవి. సింధు, వంగరాష్ట్రములలో దప్ప మిగిలిన సమస్త రాష్ట్రములలోను కాంగ్రెసున కఖండ విజయము చేకూరినది. రాష్ట్రప్రభుత్వ ముల కాంగ్రెసు నడపుచున్నది.

మహాత్ముని సమరఫలితముగ నమాత్యత్రయము — పెథిక్ లారెన్సు, అలెగ్జాండరు, క్రిప్సు — భారత దేశమునకు

నాయకభారమునకై వచ్చినారు. క్రమముగ 'రాజ్యాంగ నిర్మాణ సభ' యేర్పాటైనది.

'47 జులై నెలలో బ్రిటిష్ పార్లమెంటు 'ఇండియా స్వాతంత్ర్య చట్టమును' ప్రకటించినది. మహాత్ముని సమగ్ర ఫలితముగ భారతీయులకు స్వాతంత్ర్య మవతరించినది. 'అధి నివేశ రాజ్యాంగముగ' కొంత కాలముండి నేడా మహానీయుడు నెహ్రూ నాయకత్వమున స్వతంత్రప్రతిపత్తితో 'గణరాజ్య' [రిపబ్లిక్] మైనది.

మహాత్ముడు భారత స్వాతంత్ర్య నౌకను మహా సముద్రముల నడిపించి యొక రేవునకు జేర్చిన నావికుడు. సమర సత్యప్రియత్వము, అచంచల విశ్వాసము, అనుపమాన కార్య దీక్ష, త్యాగము, సేవ, నిర్భీతి, గాంధిజీలోని మహానాయక లక్షణములు.

ఆయన సమరవిధాన మాశాపూరితము; అపూర్వము; మైత్రియుతము. 'సత్యాగ్రహ' మాయన పరమ పవిత్ర సాధనము.

బాపూజీ వీరపుంగవుడు! అగ్రగామి!! పురుషోత్తముడు!!!

## ౭. నేతాజీ

ద్వితీయ ప్రపంచమహాయుద్ధము తీవ్రతరముగ సాగుచున్నది. కలకత్తా ప్రసిడెన్సీ కారాగారమునుండి ప్రభుత్వమున కొక లేఖ [26—10—'40] చేరినది. అం దిట్లున్నది:

"బ్రిటిషు ప్రభుత్వము నన్ను పశుశక్తితో గారాగారమున బంధింప నిశ్చయించినది. ఇందుకు నే నంగీకరిపం లేను. విడుదల యగుటయో మరణించుటయో నిశ్చయము కావలెను. మృతినొందుట వలన దాత్కాలిక ప్రయోజన మణుమాత్ర ముండ దని నే నెరుగుదును. అయినను నా జాతి జీవించి యున్నంత వరకు నది నిరర్థకము కాదు.

"నాస్మృతి భవిష్యద్భారతమున స్వాతంత్ర్యయోధుల కుత్సాహ బీజము కాగలదు...

"జగత్తులో సమస్తమును నశింపక దప్పదు. కాని భావములు ఆదర్శములు, స్వప్నములు వినాశము నొందవు. ఏ యాశయమున కొక త్యాగి ప్రాణముల బలియిచ్చునో యది సహస్ర హృదయక్షేత్రముల బునరుజ్జీవింపచేయును...

"జాతిబ్రతుకునకు వ్యక్తుల బలి యావశ్యకము. నా పునీత భారతము పౌరుషోపేతమై స్వాతంత్ర్య సముపార్జన మొనర్పవలె నన్న నేను మరణింపక దీరదు ...

"బానిసబ్రతు కొక మహాశాపము. అన్యాయములతో, నక్రమములతో సంధిగావించి జీవించుట మహాదోషము; జీవింప

దలచిన జీవము లర్పించుట సనాతన ధర్మము. దీనిని మరచి పోకు డని స్వదేశీయుల నేను హెచ్చరించుచున్నాను.”

మూర్తీభవించిన స్వాతంత్ర్యేచ్ఛ ఐతె నిట్టి లేఖను వ్రాయగల వాడెవడు ? — బోసుబాబు !



ప్రభుత్వ మాయనను విడుదల జేయకున్న యామరణాంతము 'నిరశన వ్రతదీక్ష' బూనునట! బలవంతముగ నాహారము నిప్పింప యత్నించిన సమస్త శక్తితో వ్యతిరేకించునట !! 29 నవంబరు '40 న దీక్ష నారంభించునట !!!

ప్రభుత్వము తాకీదు మరల మరల జడుపుకొన్నది. ఆయన దృఢనిశ్చయమున కాశ్చర్యపడినది. ఆయన యొక్క

యసామాన్య వ్యక్తి. సమస్త ప్రపంచమున స్వాతంత్ర్య వీరుడని ప్రసిద్ధిగన్న మహాపురుషుడు! విడుదల జేసిన నూరకొను వాడు కాడు. మరణింప నిచ్చగించిన యావద్భారతమున కార్చిచ్చు రగుల్చుకొన్నట్లు. దానిజల్లార్ప నెవరి తరముగాదు.

తమ యసమర్థత లోకమునకు వెల్లడికాకుండ బోసుబాబును ప్రభుత్వము కారాగారమునుండి విముక్తునిజేసి, యనేక నియమముల విధించి, కలకత్తాలో గృహాపరిసరములు దాటరా దని శాసించినది. కన్నుల వత్తినిడుకొని కనిపెట్టుచున్నది. భారత స్వాతంత్ర్యమే జీవితలక్ష్యముగ నిరంతరము కృషి యొనర్చుచు, శారీరక మానసిక వ్యథలతో నా మహాశూరుడాశయసిద్ధికై యుపాయాన్వేషణ మొనర్చుచు కాలము గడుపుచున్నాడు.

బోసుబాబు కలకత్తానుండి 1941 ఫిబ్రవరి నెలలో నంతర్ధానమైనట్లు వార్తాపత్రికలు ప్రకటించినవి. స్వల్పకాలమునకు బూర్వమే యాయనతో సంప్రదించిన సర్దారు శార్దూల సింగ్ కవషీర్ "భారతమున కిక స్వాతంత్ర్యము కల్లయని విసిగి వేసారి బోసుబాబు సన్న్యసించిదక్షిణ దేశములోనేపుణ్య క్షేత్రముననో కాలముగడుప వెడలియుండు" నని యొక ప్రకటన జేసినాడు. ప్రభుత్వము కురుక్షేత్రమున సన్న్యాసి వేషముననున్న బోసుబాబును పట్టుకొన్నట్లు ప్రథమమున నొక ప్రకటన గావించి తరువాత దిద్దుకొన్నది. భారత స్వాతంత్ర్య సమరాంగణమున నగ్రగామియై నేడు సన్న్యసించినాడన్న వార్తలను దేశము నమ్మలేకపోయినది. మహాభారత కురువృద్ధుల యాత్మలు దన్నావహింప వేడుకొన యాయన వెడలియుండునని భావించినది.

దేశమున కొంతకాలము బోసుబాబుమాట వినిపింప లేదు. అచంచల కార్యాచరణదీక్షతో నా దేశభక్తుడు కష్ట నిష్ఠురములకోర్చి కాబూల్ మార్గమున జర్మనీ ముఖ్యపట్టణ మగు బెర్లిన్ నగరమును జేరుకొనినట్లు జర్మన్ ఆకాశవాణి ప్రకటించినది. అది విన్ననాడు జాతీయభారత మానందతరంగ డోలికల నోలలాడినది. బోసుబాబు సైన్యముతో సరిహద్దుల బ్రవేశించి సమరము సాగించునని నిశ్చయించినది.

బోసుబాబు దూరాలోచనపరుడు. స్వప్నవీధుల విహ రింపని కార్యశూరుడు. ప్రపంచ రాజకీయముల సూక్ష్మపరి శీలనా జ్ఞానమున నవగత మొనర్చుకొన్న రాజనీతిజ్ఞుడు. ఆయన ప్రథమ ప్రపంచ మహాసంగ్రామానంతరము జరిగిన వర్సైల్సు సంధికి గ్రమముగ వ్యతిక్రమములు కలుగుట గమ నించి దూరదృష్టితో ద్వితీయ మహాయుద్ధము తప్పదని గట్టిగ నమ్మినాడు. అట్టి సమయము భారతస్వాతంత్ర్య సముపార్జ నమునకు యోగ్యమైనదని నమ్మి యాశుభక్షణమునకై వేచి యున్నాడు. అట్టి స్థితిగతు లేర్పడినవి. దేశమున సాగుచున్న సమరమునకు సహాయకారిగ సాయుధ విప్లవము కొంత సాగింపవలెనని యూహించి యాయన జర్మనులతో సఖ్య మొనర్చుకొని యుండును.

తూర్పు ఆసియాలో 1942 మార్చి లో భారత స్వాతంత్ర్యసమితి యేర్పాటైనది. దాని పర్యవేక్షణ క్రింద భారత జాతీయసైన్యము (ఆజాద్ హింద్ ఫౌజు) దేశవిము క్తికై స్వాతంత్ర్య సమరము సాగింప దలచినది. వారికి సాయ మొనర్ప వలసిన జపానువారితో సంబంధ బాంధవ్యములు సక్రమముగ లేవు. అట్టి స్థితిలో వారు జర్మనీనుండి

సుభాస్ బాబును తూర్పు ఆసియాకువచ్చి భారత జాతీయ సైన్యముతో సమరము సాగింపుడని యాహ్వానించినారు.

అటుచేత ప్రాణములతో నత్యుపద్రవకరమైన ప్రయాణ మొనర్చి బెర్లిన్ నుండి జర్మను, జపాను జలాంతర్గాములలో బోసుబాబు సింగపూరు జేరినాడు. ఆంగ్లేయపాలనలో నున్న సముద్రములలో నతని జలాంతర్గాములు నడచినవి. విశ్వాస మాయనను కాపాడినది ! దేశభక్తి యాయనచే నట్టిసాహస కృత్య మొనరింపజేసినది !!

1943 జులై 2 న దేశీయులకు దర్శన మిచ్చుటకు ముందు ఆయన పినాంగు మీదుగ జపాను ముఖ్యనగరమగు టోకియో కేగి, యాప్రభుత్వముతో నత్యావశ్యకములగు సంప్ర దింపులు జరిపి, సర్వాయత్నములును మాతృదేశ స్వాతంత్ర్య మున కనుకూలములని గ్రహించి సింగపూరుకు విచ్చేసినాడు.

4 జులై – రంగూన్‌లో కాథీభవనములు జనసమ్మర్ద ముతో గిటగిట లాడిపోవుచున్నవి. బోసుబాబు దర్శనార్థము విదేశములవారు చైనీయులు, జపానీయులు, మలయా వాసులు నితరులు వచ్చినారు. మిత్రరాజ్యముల పతాకముల మధ్యత్రివర్ణాంచిత భారతపతాకము స్వాతంత్ర్య విదాహాము ననాయున్నట్లు కొసలాడించుచున్నది. అలంకృతమైన యున్నత వేదికపై నుదయభారతమును దిలకించి మందహాస మొనర్చు చున్న మహాత్ముని తైలవర్ణ చిత్రమున్నది. వేదికకు ముందు భారతజాతీయ సైన్యము, వారివెనుక తూర్పుఆసియా రాజ్య ముల నుండి యా మహాసభకు ప్రతినిధులుగ వచ్చిన భార తీయులు నుపవిష్టులై యున్నారు.

'ఇంక్విలాబ్ -జిందాబాద్', 'మహాత్మా గాంధీకి జై', 'బోసుబాబుకు జై!' యను హర్ష నినాదములతో భవనములు ప్రతిశబ్దించుచున్నవి. మూర్తీభవించిన శౌర్యగర్వమువలె నవ నతముగాని శిరముతో, సమదృష్టితో, సాలప్రాంశువైన శరీరముతో, సభాంగణమును ప్రవేశించి వేదిక నలంకరించి యెదుటనున్న సమస్త మానవలోక హృదయముల బోసు బాబు మందస్మితముతో జూరగొనినాడు.

ఆ మహాయోధుని బుష్ప మాలాలంకృతు నొనర్చి, స్వాగతవాక్యములు పలికి భారతస్వాతంత్ర్య సమితి పూర్వా ధ్యక్షుడు రసబిహారీ ఘోష్ నిరుపమాన త్యాగముతో జాతీయ స్వాతంత్ర్యోద్యమ నాయకత్వమును స్వీకరింపుడని యర్థించి నాడు. మహోజ్జ్వల శిల్పమూర్తివలె వేదికపై నిలచి బోసు బాబు కార్యభారము వహింప నంగీకారమును దెలిపిన మరు క్షణమున 'నేతాజీ కి జై', 'ఇంక్విలాబ్—జిందాబాద్' అను వీరనినాదములతో నాభవనములు ప్రతిధ్వనించినవి.

నేతాజీ రస బిహారీ నభినందించి భారతీయ సోదరుల నుద్దేశించి యొక మహోపన్యాస మొసగినాడు.

"సర్వాజ్యాకాంక్షులైన భారతీయులకు గార్యరంగమున ప్రవేశింపవలసిన సమయ మాసన్నమైనది. నేటి యుద్ధపరిస్థితు లలో గార్యాచరణమునకు గ్రమశిక్షణ మావశ్యకము. ఈ తూర్పురాజ్యములలోని భారతీయు లెల్లరు సేనవాహినినై రాబోవు మహాసమరమునకు సిద్ధము కండు.

"స్వదేశమున బోరాడుచున్న సమరయోధులకు గార్య కర్తలుగ దేశభక్తులైన భారతీయులు నేడెందరో విదేశము

లలో వ్యవహరించుచున్నారు. వారు మును పొనర్చినదియును ముందొనర్పబోవునదియును భారత స్వేచ్ఛకొరకే. దేశీయుల యాశయములకు వ్యతిరిక్తముగ గాని, భారతసౌభాగ్యమునకు వ్యతిరేకముగగాని మన మెన్నడును బ్రవర్తింపము.

"కేవల స్వయంకృషి మూలకములైన సేవాత్యాగ ములవలన సముపార్జించిన స్వేచ్ఛనే మనము చిరస్థాయిగ నిలుపుకొనగలము: అంతమున విజయము మనదే. అంత మాత్రమున శత్రువుల శక్తి యల్పమని మనము భావింప రాదు. మన సంకల్పములకు దాత్కాలికముగ నెట్టి యాటంక ములు కలిగినను వానికి మనము సర్వదా సంసిద్ధులము.

"ముందున్నది శత్రువులతో మహాసమరము. మనశత్రువు శక్తివంతము, నీతి విరహితము, కుటిలము, క్రూరము. మన స్వాతంత్ర్యమునకై నేడు సాగింప నున్న యీచరమయాత్రలో నాకలిదప్పుల నెదుర్కొనవలెను; కష్టముల గరకుబారవలెను; బలవంతములు బయనింపవలెను; మృత్యువును బరిహసింప వలెను.

"ఇట్టి యగ్నిపరీక్షల కాగిననాడే విజయము మీది. మీరింతులకు సంసిద్ధులై వర్తించి దానిసవృత్తిలో మ్రగ్గి నిర్భా గ్యమైన మన పవిత్ర భారతమునకు స్వేచ్ఛా సౌభాగ్యముల సంపాదింతు రని నా దృఢ నిశ్చయము."

నేతాజీ ప్రసంగమును విన్న భారతీయు లెల్లరును మంత్రముగ్ధులైనారు. వారి రక్తము దుడుకెత్తినది. శరీరము ఋప్పొంగినవి. పురాతన భారత ప్రాభవము, నేటి దౌర్భాగ్య స్థితి కన్నులగట్టినది. భవిష్యత్తువారికి ద్యోతకమైనది. వారాయ

నలో నొక స్వాతంత్ర్య సమరయోధుని, మహానాయకుని దర్శించినారు. ఆత్మవిశ్వాసముగల యామహాత్ముని పిలుపు నకు నిలువెల్ల జలించి సమస్తమును ధారవోసి నడిపిన బాటను నడువ నిశ్చయించినారు.

అమెరికా స్వాతంత్ర్య నేత జార్జి వాషింగ్టనుకు ప్రత్యేకసేన యున్నది. ఇటలీ స్వేచ్ఛాప్రదాత గారిబాల్డీకి సమరశిక్షణపొందిన సేవాదళమున్నది. భారతమునకు జాతీయ విముక్తిసైన్యము లేదన్న కొరత యొకటి పూర్వము నేతాజీని బాధపెట్టుచుండెడిది. కెప్టెన్ మోహన్ సింగు కృషి ఫలిత ముగ నాయన కది యప్రయత్నపూర్వకముగ లభించినది.

25 ఆగస్టు '43 న నేతాజీ భారత జాతీయసైన్యము నకు సర్వసైన్యాధ్యక్ష పదవిని స్వీకరించినాడు. సైన్యముల నిట్లుద్బోధించినాడు :

"భారత విముక్తి సేనకు నాయకత్వ పదవిని స్వీకరిం చుట కన్న భారతీయుడై పుట్టినందుకు సార్థకత యేమున్నది? ఇది నాకు మహదానంద కారణము! గర్వకారణము!!

"ఎత్తుకొన్నది మహత్తర కార్యభార మని నే నెరుగు దును. ఎట్టి విషమస్థితిలోనైన నాభారతీయులకై కర్తవ్యపాల నమున నావశ్యమగు శక్తిని ప్రసాదింపవలసినదని భగవంతుని వేడుకొనుచున్నాను. భారతీయ నాయకత్వమున నీసేవ నిర్మిత మైనందుకు ప్రతి భారతీయ హృదయమును గర్వింపవలసినదే.

"'చలోఢిల్లీ' మీయుద్ధ నినాదము. మనలో నెందఱు స్వేచ్ఛాసమరమును గడచి జీవింతురో నే నెరుగను. కాని యంతిమ విజయము మనదే యని నే నెరుగుదును. మనలో

మిగిలిన వీరులు బ్రిటిష్ సామ్రాజ్య శ్మశానవాటిక యగు 'ఎఱ్ఱ కోట' లో విజయప్రదర్శనములు జరిపిననాడు గాని మన కార్యభారము తీరదు.

"మీరు భారత జాతీయగౌరవమునకు గార్యకర్తలు. మీరే మూర్తీభవించిన భారతీయాశయములు: ఏ సైన్యము నకు మాతృదేశముపై నచంచల భక్తివిశ్వాసములో, సర్వ కాల సర్వావస్థలయందే సైన్యము కర్తవ్యమును నిర్వర్తించునో, యే సైనికులు నిరంతరము ప్రాణత్యాగ మొనర్ప సంసిద్ధులో వారజేయులు. ఈ యాదర్శత్రయమును మీ హృదయ కోశముల లిఖించుకొనుడు."

నేతాజీ దృక్పథము సమస్తము వారి కవగత మైనది. వారిహృదయమును నాతడేలుచుకొనినాడు. భక్తి ప్రేమలతో దమ సర్వస్వమును వారాయన కర్పించినారు.

సైనికుల భోగట్టాలు సిద్ధమైనవి. సైన్యవిభాగములు జరిగినవి. సేనానాయకు లేర్పాటైనారు. వారికి నేతాజీ శిక్షణ శిబిరముల నేర్పాటుచేయించినాడు; వారిని దేశసేవాతత్పరులు గను, స్వార్థరహితులుగను, త్యాగమూర్తులుగను దీర్చిదిద్ది నాడు. వారిలో జాతి, మత, ప్రాంతీయవైషమ్యములు లేవు. శిక్షణము నవ్యభారతమున కనుగుణము.

"స్వయముగ నేను భారత జాతీయ సైన్యమున జేరి నాను. భారత దాస్యవిముక్తికి నాజీవితము నంకిత మొనర్చు చున్నాను. నాసర్వస్వము నొడ్డి మాతృదేశమునకై పోరాడు దును. ఈసేవలో నే నెట్టి స్వార్థము నాసించను. సమస్త భార తీయులు నాకు సోదరులు, సోదరీమణులు—నా దృష్టిలో మత, భాషా రాష్ట్ర విభేదములు లేవు."

అని ప్రతిసైనికుని యొద్దనుండి ప్రమాణమును గైకొని నేతాజీ సైనికులను సంసిద్ధులు కండని యనుజ్ఞ నిచ్చినాడు.

ప్రపంచమున కింతకు బూర్వమే ఆజాద్ హిందు ఫౌజును గురించి యాకాశవాణి ముఖమున 5 జూలై '43 న నేతాజీ యెరుకపరచినాడు.

బ్రిటిష్ వారితో యుద్ధమును బ్రకటించుట యన్న సామాన్యము కాదు. అంతర్జాతీయములగు ననేక విషయముల బరిశీలించినగాని యొప్పదు. కేవల సైన్యము చాలదు. ప్రత్యేక ప్రభుత్వము కావలెను. అందుకై నేతాజీ యొనర్చిన కృషి ఫలించినది.

21 అక్టోబరు '43 – నాడు తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వోత్సవమును వైభవోపేతముగ సింగపూర్‌లో జరిపించినదానికి నధ్యక్షుపదవిని నేతాజీ స్వీకరించినాడు.

"తుది నిశ్శ్వాస ముండువరకును భారతదేశమును, ముప్పది యెనిమిది కోట్ల భారతీయులను దాస్యవిముక్తుల నొనర్ప సుభాస్ చంద్రబోసు అను నేను పవిత్రయుద్ధము కొనసాగింతు నని పరిపూరిత ప్రమాణమును పరమేశ్వరు సాక్షిగ స్వీకరించుచున్నాను. నిరంతరమును భారతీయ సేవకుడనై భారత సోదర సోదరీమణుల సౌభాగ్యమునకై శ్రమింతును. ఇది నా పవిత్ర కర్తవ్యము. స్వేచ్ఛా సంపాదనానంతరము దానిని సుస్థిరము గావింప నాశరీరములోని తుది రక్త బిందువువర కొలికింతును."

—ఇది బోసుబాబు గైకొనిన ప్రమాణము.

తదుపరి తాత్కాలిక ప్రభుత్వసభ్యులు నేతాజీ యెడ సంపూర్ణవిశ్వాసమును బ్రకటించుచు నుపన్యసించి యాయన యడుగుజాడల నడతు మని ప్రతిన జేసినారు. నేతాజీ యొక దీర్ఘ ప్రకటన జేసినాడు. అందు 1857 నాటి ప్రథమస్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర స్మృతమైనది. సురాజుద్దౌలా, హైదరాలీ, టిప్పుసుల్తాన్, వేలుతంబి, అప్పాసాహెబ్, బాజీరావు, లక్ష్మీబాయి, తాతియాతోపీ, కుంవరసింగ్, నానాసాహెబుల వంటి విప్లవవీరుల పవిత్ర నామములు అంకితములైనవి. కాంగ్రెస్ జన్మమాదిగ స్వేచ్ఛాసంపాసకై కావించిన వివిధ యత్నముల నాయన పేర్కొనినాడు.

"దొంగతనములతో, దోపిడులతో, క్షామములతో, మోసములతో, మృత్యువులతో, దేశీయుల హతాశుల గావించి సుహృద్భావమును కోల్పోయి, బ్రిటిష్ప్రభుత్వము భారతదేశమున నేడు మహోపద్రవమున నున్నది. ఈదుర్బల ప్రభుత్వ చరమ చిహ్నమును రూపుమాపుటకొక యగ్నిజ్వాల చాలును. భారత విముక్తి సైన్యము తలపెట్టిన మహత్తర కార్య మిదియే!

"స్వాతంత్ర్యమునకు ఉపసన్నదగు నీనాడు తాత్కాలిక ప్రభుత్వము నేర్పాటుజేసుకొని యా ప్రభుత్వపు పతాకచ్ఛాయలలో తుదిసమరము సాగించుట భారతీయుల కర్తవ్యము. మహానాయకు లందరును స్వదేశమున కారాగారములలో నున్నారు. ప్రజలా నిరాయుధులు. అందువలన నట్టి ప్రభుత్వమును భారతమున నెలకొల్పుటకు గాని, దాని నిర్వహణమున స్వాతంత్ర్యసమరమును సాగించుటకు గాని యవకాశము లేదు. అందువలన భారతీయులకు తూర్పుఆసియా

లోని భారతీయ సోదరుల తోడ్పాటుతో 'ఆజాద్ హింద్' తాత్కాలిక ప్రభుత్వమును స్థాపించి తామే నిర్మించుకొనిన ఆజాద్ హింద్ ఫౌజు సహాయమున చరమ స్వాతంత్ర్య సమరమును సాగించుట కర్తవ్యము.

"ఈ తాత్కాలిక ప్రభుత్వము ప్రతిభారతీయుని భక్తి భావముపైనను సర్వాధికారి. ప్రతిపౌరున కీప్రభుత్వముసమాన ప్రాతినిధ్యమును, మత స్వాతంత్ర్యమును వాగ్దాన మొనర్చు చున్నది. దేశమందలి సమస్త ప్రాంతములను శాంతి సౌఖ్య సౌభాగ్యముల వృద్ధిపొందించుట, కుతంత్రములతో విదేశీయ ప్రభుత్వము సృష్టించి పెంచిన వైమనశ్యముల రూపుమాపుట కీ ప్రభుత్వము తీర్మానించినది.

"పరమేశ్వర నామ ముచ్చరించి, వెనుకటి తరముల భారతీయుల నేకజాతిగ మలచిన మహాదేశభక్తుల నామ ముల నుచ్చరించి, భారతీయ సంస్కృతికై త్యాగములనొనర్చి మరణించిన మహావీరుల నామ ముచ్చరించి, యీ ప్రభుత్వపు జెండానీడల నిలచి పోరాడవలసినదని భారతీయ మహాప్రజను నేను పిలుచుచున్నాను."

చారిత్రాత్మక మగు నీ పత్రికపై నేతాజీ తాత్కాలిక ప్రభుత్వసభ్యుల స్వహస్తములవ్రాలు జేయించినాడు. ఆయన ప్రభుత్వమును ప్రపంచములోని యనేకప్రభుత్వము లంగీకరించి నవి. జపానుప్రభుత్వము యుద్ధసమయమున బ్రిటిష్ వారినుండి కైవస మొనర్చుకొనిన అండమాను, నికోబార్ ద్వీపముల నేతాజీ పర మొనర్చినది. ఈ ద్వీపములలో విప్లవవీరుల నందర బ్రిటిష్‌వారు బంధించి బాధలు పెట్టుచువచ్చిరి. ఆ ద్వీపములు

నేతాజీకి వచ్చుటవలన తాత్కాలిక ప్రభుత్వమునకు స్థానము చిక్కినది. అవి నేడు స్వారాజ్యదీవులు! నేతాజీ దీవులు!

నేతాజీ సింగపూరు వచ్చిన తరువాత కొలది కాలము నకు మహోపన్యాసము లొనర్చినాడు. తూర్పు ఆసియా రాజ్యములలోని స్వాతంత్ర్య పిపాసను నాశాసించుచు, ఘనగర్జన లొనర్చినాడు. 'నాకు మూడుకోట్ల డాలర్లు కావలెను. మీసమస్తము నాకిండు. 'ఫకీరులు' కండు, మీకు నేను స్వాతంత్ర్య మిత్తు' నన్న గర్జన ఫలించినది. ధనరాసులు తండోప తండములుగ వచ్చిపడినవి. ఏప్రియలు '44 లో నేతాజీ 'ఆజాద్ హిందూ బ్యాంకి'ని స్థాపించినాడు. సైన్యముల కాహారాది పదార్థముల సేకరించి వ్యవహరించుటకు 'సరఫరా సంఘము' నొకదాని నేర్పాటు చేసినాడు. జాతీయసేన లాక్రమించిన ప్రదేశములలో శాంతిస్థాపన మొనర్చి పాలించుటకు 'ఆజాద్ హింద్ దళము'ను నిర్మించినాడు; దానికి క్రమశిక్షణ మిప్పించినాడు.

ఒకానొక ప్రసంగమున నేతాజీ 'ప్రథమ స్వాతంత్ర్య యుద్ధములో వీరఝాన్సీ పట్టిన ఖడ్గమును ధరించి మృత్యువును దిరస్కరింపగల భారతనారీమణుల శాఖ యొకటి నాకు గావలె' నని కోరినాడు. మహిళల నుద్దేశించి గంభీరముగ నొనర్చిన ప్రసంగములోని కొన్ని వాక్యము లివి:

"ఆయుధముల ధరించి యుద్ధభూమిని బ్రవేశించుట స్త్రీ స్వభావము కాదని యెవరైన భావించుచున్నారా? మన పూర్వచరిత్ర నొకమారు దిలకింపుడు. అశ్వ మధిరోహించి, వీరపురుషోచిత వేషముధరించి సైన్యముల కగ్రేసరియైఝాన్సీ రాణి వానిని నడిపింప లేదా? మన దురదృష్టమున నామె

పతనమైనది; ఆనాటిభారతమే పతనమైనది. 1857 లో నామె యారంభించిన కృత్యమునే నేడు మనము సాగింప వలసి యున్నది. ఈకడసారి కదనమున నొక ఝాన్సీరాణి చాలదు. వేనవేలు కావలెను. మీరు ధరించి పోరాడు నాయుధములు నాకుముఖ్యములుగావు. మీపోరాటమే నాకు నైతికబలము."

తూర్పు ఆసియా భారత మహిళామణులు 'శిలలు ద్రవింప' పలుక నేర్చిన నేతాజీ కేక వినినారు. స్వచ్ఛందసేన లలో ప్రవేశించి శిక్షితులై యుద్ధరంగమున శత్రువు నెదు ర్కొన బ్రతిన జేసినారు. నేతాజీ 22 అక్టోబరు '43 న సింగ పూరులో వారి కొక ప్రత్యేక శిక్షణశిబిర మేర్పాటు జేయించి నాడు.

భావిభారత పౌరులగు బాల బాలికలన్న నాయన కభిమానము విశేషము. వారికి స్థానిక స్వాతంత్ర్యసంఘముల పర్యవేక్షణలో సైనికోద్యోగులచే శిక్షణ మిప్పించినాడు. స్వాతంత్ర్యసమరమున 'మీరును యుద్ధమొనర్తు' రని నేతాజీ వారి కుత్సాహము గల్పింప బలికినపుడు వారు పొందిన యానందమునకు మేరలేదు. వారిలో ననేకులు 'ఆత్మహత్యా దళము (జన్ బజ్)' లో జేరినారు.

ఒకమారు 'బాలసేన' మేము 'ఆజాద్ హింద్ ఫౌజ్' లము కామా? నేతాజీ!' యని ప్రశ్నింప నేతాజీ "కారని యన్నవారెవరు? వారితో రణరంగమున మేమే ముందు ప్రవే శింతు మని పలుకు" దని ప్రోత్సహింప వారు పొందిన యుత్సాహమును జూచి నేతాజీ కనులవెంట నానంద బాష్పము లొలికించినాడు; 'భారత మిక స్వతంత్రము కా కెట్లుండు' నని తలపోసినాడు.

24, 25 అక్టోబరు '43 రాత్రి 'నేతాజీ తాత్కాలిక ప్రభుత్వము' బ్రిటను, అమెరికాలపై యుద్ధమును ప్రకటించినది.

యుద్ధ ప్రకటనానంతర మరుక్షణముననే నేతాజీ మహాత్మాగాంధిజీ నుద్దేశించి 'ఆకాశవాణి' లో

"జాతిపితా! మాతృదేశ స్వాతంత్ర్యమునకై మే మీ మహాయత్నమునకు బూనుకొనినాము. ఇట్టి స్థితిలో మమ్మాశీర్వదించి నడిపింపు" మని వేడికొనినాడు.

ఆయనకు నెహ్రూ, అజాద్ వంటి నాయకులపై గౌరవము మెండు. కొన్ని దళములకు వారి నామము లుంచి వ్యవహరించినాడు.

'చలో ఢిల్లీ!' వీరనినాదములతో ఆజాద్ హింద్ ఫౌజు పురోగమన మారంభించినది. ప్రారంభ వేళ సర్వసైన్యాధ్యక్షుడు నేతాజీ ఢిల్లీ యున్న దిశకు జూపించుచు-

"అదుగో ఆ దూరమున, ఆ నది వెనుక ఆ అరణ్యముల కావల, ఆ పర్వతశ్రేణి కవతల, అదే మనపుణ్యభూమి! ఏ చల్లని తల్లి గర్భమున మనము జన్మించినామో ఆ స్వర్గసీమ అదియే!! మనము చేరుకొననున్న చిన్మయ భూమి!!!

"వినుడు! భారతము పిలుచుచున్నది. వినుడు!! మేల్కొనుడు!!! అవసరమగుచో దేశమునకై తనువు లర్పించి త్యాగధనులమై మనము ప్రాణము విడనాడుదము. మన కడసారి నిద్రలో మన సేనలను ఢిల్లీకి గొనిపోవు రాచబాటను ముద్దిడు కొందము. ఢిల్లీ మార్గమే స్వాతంత్ర

మార్గము—చలో ఢిల్లీ!" యని యుద్రిక్త మానసుల గావించి ముందుకు సాగిపో నాజ్ఞాపించినాడు.

స్వాతంత్ర్య పిపాసాముతో మరుమరీచికల జూచి భ్రమపడి పరువెత్తు భయంకర ప్రాణికోటివలె సైన్యము పర్వులెత్తుచున్నది. పరవశత్వమున నేతాజీ కన్నుల నానంద బాష్ప స్రవంతు లొలికినవి.

ఇంఫాల్ ప్రథమరంగస్థలము. అత్యున్నత ప్రదేశములు, అగాధమగు లోయలు, కారడవులు: అవేవియు ఆజాద్ హింద్ సైన్యము నాపలేక పోయినవి. గ్రీష్మమున రగుల్కొనిన కార్చిచ్చువలె గ్రమ్ముకొని వ్యాపించుచు నవి నడచుచున్నవి. కోహీమా, తముా, మణిపూర్, కలదన్ లోయ, ఆక్యాబ్ వరకు సైన్యములు ప్రాకినవి.

మేజర్ జనరల్ కియానీ నాయకత్వమున కొంతసేన శత్రువుల వెన్నాడుచున్నది. ఒక్కొక స్థానమును వదలి శత్రువులు కాలికి బుద్ధిచెప్పుచున్నారు. అజ్మీర్‌సింగు కోహీమాను బట్టుకొనినాడు. కలదన్ లోయలలో మేజర్ రాటూరి పశ్చిమాఫ్రికా సేనలను దరిమికొట్టి చిట్టగాంగుపై బడినాడు. మేజర్ మిశ్ర ఆక్యాబ్ రంగమున శత్రువుల తంతి మార్గముల భగ్నమొనర్చినాడు.

ప్రధానసేన ఇంఫాల్ మైదానములో బ్రవేశించి శత్రువుల తిరోగమింప జేసినది. సుభాసు దళములో కర్నల్ షా నవాజ్ మణిపుర మార్గమున శరవేగముతో పయనించుచున్నాడు. కియానీ గాంధీదళముతో ఇంఫాల్ దుర్గ ప్రధాన కవాటముల దుత్తునియలు జేసినాడు. తము మార్గమున శత్రు

వుల కందకముల జెల్లాచెదరొనర్చిన లెఫ్టినెంటు కర్నల్ ప్రీతమసింగుకు పాలేల్ వశమైనది. కర్నలు గుల్జారా సింగు ఆజాద్ సేనతో పశ్చిమదిశను శత్రువుల రక్షణశిబిరములపై బడినాడు. నెహ్రూదళము కర్నలు అజీజ్ నాయకత్వమున విశ్రాంతి సైన్యముగ వెనుక వచ్చుచున్నది.

శత్రువుల ముఖ్యస్థానములలో జొచ్చికొని పోయి, బహదూర్ శాఖలు, ఆత్మహత్యాదళములు నత్యావశ్యకములైన వార్తలు దెచ్చుచున్నవి.

స్వేచ్ఛను ప్రసాదించిన గ్రామములలో శాంతిస్థాపన మొనర్చి క్రమపాలనమును నెలకొల్ప మేజరు జనరలు ఛటర్జీ వెనువెంట వచ్చుచున్నాడు.

కర్నలు మాలిక్ జాతీయ పతాకారోహణ మొనర్చుచు విజ్ఞాన శాఖను నడుపుచున్నాడు.

ఇంఫాలు నగరము కనుచూపు మేరలో నున్నది. అది శత్రువుల ప్రధాన స్థానము. అటనుండి వారు నేతాజీ సేన నెదుర్కొనుచున్నారు. వారి 14 వ సైన్యము జాతీయ సైన్య ఘాటికి తాగలేక రూపుమాసి పోవుచున్నది. శత్రువులు రక్షణ వ్యూహమును చక్రాకృతిగ నిర్మించుకొనినారు. ముందు 'టాంకులు,' తరువాత 'ఫిరంగులు,' ఆ వెనుక సేనయు నున్నది. వాయు విమానములపై నూతనసైన్యములు వచ్చి వారిని జేరుకొనుచున్నవి. కాని యేమి ప్రయోజనము ? వారికి సైనికబలము లేదు.

అయినను తప్పనిసరిగ ముందుకు సాగివచ్చినారు.

12 ఫిబ్రవరి '44 న సేనానాయకుడు షా నవాజ్ ఉత్తర బర్మాలోని జపాను సైన్యాధ్యక్షునితో సంప్రదించి నప్పు డాతడు జాతీయ సైన్యమునకు గావలసిన వాయువిమాన ములు, నాహారపదార్థముల నిత్తునని వాగ్దానము చేసినాడు. వాయువిమానములు రాలేదు. తినుటకు తిండియైన లేదు. కందమూలముల తినుచు మహారణ్యములలో నేతాజీవీరులు నాయకునియెడ నచంచల భక్తి విశ్వాసములతో ధైర్య సాహసములతో భయంకర యుద్ధములు గావించినారు.

శత్రువు నెదుర్కొనలేక జపానీయులే పారిపోవు చున్నారు. ఆకలిబాధల కోర్వలేక ఆజాద్ హిందు సేనలో ననేకు లాత్మహత్య జేసికొనినారు.

ఇట్టి క్లిష్టపరిస్థితిలో ద్రోహులు కొందరు శత్రుపక్షముతో సంధి జేసికొని వారి కత్యావశ్యకములైన సమాచారము లందజేసినారు. దైవమును దాత్కాలికముగ వారి కనుకూ లించినది — కుంభవృష్టులు కురిసినవి.

స్థితిగతుల నవగత మొనర్చుకొని నేతాజీ తిరోగమింప సేనల నాజ్ఞాపించినాడు. ఇం దాతని యుద్ధవిశారదత్వ మెంత యును వెల్లడి యైనది.

తిరోగమనమున సేన లపారనష్టముల పాలైనవి. వాన వేగమున మాండలే, మైమ్యోల వరకు జేరిన వారికి మాత్రము విశ్రాంతి చేకూరినది. మిగిలినవారు శత్రువులకు జిక్కుటో, యాత్మహత్య గావించుకొనుటో జరిగినది.

21 ఆగష్టు '44న తిరోగమనమున కనుజ్ఞ నొసగినాడు. ఈ తిరోగమనము తాత్కాలికము. నేతాజీ ధైర్య మగు

మాత్రము క్షీణింపలేదు. తిరోగమన మొనర్చి తిరిగివచ్చిన సైనికులతో నిట్లు పలికి వారికి సంతోష మొడగూర్చినాడు :

"భారత స్వేచ్ఛాసమరమును భారతభూమిలో ప్రవేశించి సాగించినాము. అనేక కష్టములకు లోనై మనసేన పోరాడినది. సన్నాహ మణుమాత్రము లేక కేవల నైతిక బలముతో బోరాడిన మనల నెదుర్కొనశక్తివంతము, సర్వ సంపన్నము నైన బ్రిటిష్ సైన్యము లెంత గిజగిజ లాడినవి! మన యుద్యోగుల, సైనికుల వీరకృత్యములు జగద్వినుతికి బాత్రములైనవి."

ఇట్టి సంతృప్తికరవాక్యముల పలుకుట మహానాయక లక్షణము!

తిరోగమించిన సైన్యముతో నేతాజీ మాసముదిన ములుగడిపి వారికి గలిగినక్షతములను సమస్తమును మాంత్రికునివలె మటుమాయ మొనర్చినాడు. వైద్యశాల లన్నియు రోగులతో నిండియున్నవి. నానారకములైన రుగ్మతలతో సైన్యము బాధ పడుచున్నది.

ఝూన్సీదళములోని వీరవనితలు వారి కుపచారము లొనర్చి తేర్చుచున్నారు. వారిపై శత్రువిమానములు దాడులు చేయుచున్నవి. ఎటులనైన బ్రాణముల దక్కించుకొనుటకు వారు ప్రయత్నించుచున్నారు.

ఇది బ్రతుకుపై నాశవలన గాదు; మాతృదేశ సేవా పరత్వమున!

వరద లాగినవి. బ్రిటిష్‌వారి 14 వ సేన ముందుకు సాగి వచ్చుచున్నది. నేతాజీ తిరోగమించి వచ్చిన సైన్యమును

మార్చి రంగమున నూతన సైన్యమును జేర్చినాడు. గడచిన యుద్ధముల వలన కొన్ని యనుభవములు కలిగినవి. ఆజాద్ హింద్ ఫౌజు యుద్ధము పర్యవేక్షింప 26 అక్టోబరు '44 న యుద్ధ సమితి కొకదానిని నేర్పాటు జేసినాడు. సైన్యములకు గావలసిన యాహారపదార్థముల సకాలమున కందింపవలసిన బాధ్యత వారిపై బెట్టినాడు. యుద్ధభూముల బ్రవేశించుటకు ముందు వీరితో నిట్లు ప్రసంగించినాడు :

"భవిష్యత్తును గురించి యొక రమ్యరూపమును బ్రదర్శింప దలపలేదు. శత్రువు సమస్త సన్నాహములతో మనపై బడ సంసిద్ధుడైనాడు. మనమును సన్నాహముల జేకూర్చుకొనుచున్నాము.

"ఇండియా రక్షణమునకు శత్రువులు అస్సాములో యుద్ధమొనర్ప నిశ్చయించినట్లున్నారు. వానిని భారతదేశమున స్టాలిన్‌గ్రాడ్ నగరము గావించినట్లున్నది. ఈ సంవత్సరమున బ్రపంచ యుద్ధఫలితమే నిర్ణీతము కానున్నది. ఇంఫాల్ కొండలందును, చిట్టగాంగు మైదానములలోను మన భారతీయ స్వాతంత్ర్య జాతకము తేలిపోగలదు.

"చలో ఢిల్లీ' తో బాటు 'రక్తము, మరింత రక్తము'— అను మరియొక యుద్ధనినాదము చేర్చినాము. భారతదేశ స్వేచ్ఛకై మనము రక్త మొలికింతుము. శత్రురక్తము నొలికింతుము.

"రాబోవు నూతన స్వేచ్ఛా యుద్ధఘట్టమున పూర్వమీ సమరయాత్రలో మృతినొందిన మహావీరుల పవిత్రాత్మలు మనల నావహించి వీరోచిత కృత్యముల నొనరింప నుద్బోధించుగాక."

నేతాజీ సైన్యములకు యుద్ధారంభ మొనర్ప మరల '45 మార్చి ప్రథమవారమున ననుజ్ఞ నొసగినాడు.

'45 ఆరంభమున విజయగర్వముతో అమెరికా సేనలు ముందుకు సాగివచ్చుచున్నవి. పురోగమించుటకంటె నేటి స్థితిలో ఆజాద్ హింద్ ఫౌజు కర్తవ్యము స్వరక్షణ మని నేతాజీ గమనించినాడు. ఇంఫాల్ రంగమున దీవ్రతరముగ బోరాడిన సైన్యమును వెనుకకంపి నూతన సైన్యమును ముందునకు దరలించినాడు.

గత వత్సర యుద్ధమునందు జాతీయ సైనికులు, దేశ భక్తియుతులై, వీరాధివీరులవలె పోరాడిరి. కాని కొందఱి దేశద్రోహము, పందతనము వలన నష్టము ప్రాప్తించినది.

అట్టి యవకాశములు ముందెన్నడును గలుగకుండుటకు నేతాజీ జాగరూకత వహించినాడు. కాని సైన్యమున దేశ ద్రోహ బీజములు పొడకట్టుచునే యున్నవి. అట్టివారిని శిక్షింప నుద్యోగుల కనుజ్ఞ నొసగినాడు. సైన్యములో నున్న పందతనముబాప నాటకము లాడించినాడు; మహమ్మద్ బక్ష్, రైయద్, మదనులవంటి దేశద్రోహుల విగ్రహముల జేయించి యవమానముతో నూరేగింప జేసినాడు. పూర్వవీరుల శౌర్య పరాక్రమములను బ్రశంసించుచు నుపన్యాసము లిప్పించినాడు. యుద్ధారంభదశలో షానవాజ్ ఖాను సైన్యము నుద్దేశించి యిట్లు పలికినాడు :

"ఇందు ముఖ్యులైన సైనికులు నుద్యోగులు నున్నారు. యుద్ధమన్న కష్టపరంపరలతో, మృత్యువుతో గూడినది. దాని కెవరైన వెఱచువా రున్న నిప్పుడే నిలచిపొండు. మనము

సాగింప బోవునది స్వేచ్ఛాసమరము. ఇందు పందలకు తావు లేదు. భారతము స్వతంత్రమైన వెనుక నేడు మనకు సాయ మొనర్చుచున్న జపానీయులు మనల లోంగదీయ యత్నించినచో వారితో గూడ మనము సమర మొనర్పవలసినదే! మనము జపానీయుల కేవిధముగ ననుచరులము కాము."

'45 మార్చి మూడవ వారము నెప్రూసేన బ్రిటిష్ వారి 19 వ సేనతో దలపడి స్వతంత్రముగ న్యాంగు, వాగను నదీముఖముల ఘోర సమర మొనర్చుచున్నది. షానవాజ్ నాయకత్వమున గొంతసేన 'పోపా' ప్రాంతమున పోరాడు చున్నది. ఫిరంగులు లేవు, వాయువిమానములు లేవు. నెల దినములు సైన్యము 'పోపా' ను రక్షించుకొనినది.

ఆజాద్ హింద్ ఫౌజు బ్రిటిష్ సేనల పురోగమనమును గొంతకాల మాపగలిగినది. కాని యది కేవల సైనికబల ముతో బోరాడ లేకున్నది. ఇంతలో బర్మాజాతీయ సైన్యము లొంగిపోయినది. జపాను బలములు యుద్ధరంగమును బరిత్య జించి యేనాడో పారిపోవ నారంభించినవి.

నేతాజీ సైన్య మొంటిగ మహోత్తర శత్రుసైన్యము నెదుర్కొని పోరాడవలసివచ్చినది. 'నేతాజీ కీ జై, ఇంక్విలాబ్—జిందాబాద్, ఆజాద్ హిందూస్తాన్—జిందాబాద్, చలో ఢిల్లీ'—నినాదములు శత్రువులు కురిపించిన యగ్నివర్ష ములపై నాకసమున ప్రతిధ్వనించుచున్నవి.

యుద్ధముల వ్యక్తిగతములైన వీరోచిత కృత్యముల నేక ములు. ముష్టి యుద్ధములలో రామసింగ్, గ్యానిసింగుల వంటి వీరాధివీరుల పోరాటముల జూచి శత్రువులు భయకంపితు

లైనారు. వారు నేతాజీ యాదర్శముల కనుగుణముగ పోరాడి నారు. కేవల సాహసమేగాని సాధన సంపత్తిలేదు. ఎంత కాలము యుద్ధమును సాగింపగలరు ?

మోల్‌మీన్ వరకు తిరోగమింప వలసినదని నేతాజీ సేనల కాజ్ఞ నొసగినాడు. సైన్యమును శత్రుపక్షమునుండి పెగూ యోమా సైన్యములు చుట్టుముట్టుచున్నారు. మే 13 తేదిన షానవాజ్ సైన్యము చక్రవ్యూహమున జిక్కుకొనినది. ఆనా డతని సైన్యములో నలుబదితొమ్మిది మంది మాత్ర మున్నారు. వారి కతడు తమ స్థితిని విశదీకరించినాడు. కాని వారు లొంగిపోవుట కిష్టపడలేదు ? పోరాడుచున్నారు.

జనరల్ స్లిమ్ నాయకత్వమున బ్రిటిష్ శత్రుసైన్య ములు వర్షాకాల జలదములవలె గ్రమ్ముకొని వచ్చుచున్నవి. ఒక యరణ్యమునుండి మరియొక యరణ్యమునకు ఆజాద్ హింద్ ఫౌజు నవి వెంటబడి తరుముచున్నవి. అంతలో మైటి కినా పడిపోయినది. జపానువారు రంగూను వదలిపెట్టినారు. నేతాజీ "తుదిప్రాణి యున్నంత వరకును రక్షించి తీరవలె" నని యాజ్ఞాపించినాడు.

యుద్ధమంత్రుల కోరికపై నేతాజీ రంగూను నగర మును వదలిపెట్టవలసి వచ్చినది. అట్టి స్థితిలో నారువేల జాతీయ సైన్యమును నగరప్రజల రక్షణార్థము నియమించి నేతాజీ వెడలినాడు. ఆయనవెంట నమ్మినసేన, రెండువేల బలముతో, బాంకాక్ వలకనుసరించినది. స్వారాజ్యదీవుల హైకమీషనరు జనరల్ లోకనాథము 'బర్మారంగములోని జాతీయసైన్యమును, భారతీయ సైన్యమును, భారతీయ ప్రజ లను గాపాడెద' నని నేతాజీకి వాగ్దానము నజేసినాడు.

సింగపూరుకు వెడలుచు 24 ఏప్రియల్ '44 న నేతాజీ సైన్యమున కీప్రత్యేకాదేశ మిచ్చినాడు :

"వీరోద్యోగులారా! సైనికులారా!! భరింపగాని హృదయభారముతో నేను బర్మానుండి వెడలిపోవుచున్నాను. '44 ఫిబ్రవరినుండి స్వాతంత్ర్యసమరము సాగించినాము. ఇంఫాల్ బర్మారంగములలో మనకు విజయము చేకూరలేదు. ఇంక నిట్టి సమరము లెన్నియో సాగింపవలసియున్నది.

"ఎట్టి విషమస్థితియందైన నేనపజయము నంగీకరింప నేరని యాశావాదిని. ఇంఫాల్ మైదానము లందును, బర్మా రంగములోను, ఆరకాన్ అరణ్యములలోను శత్రువులతో పోరాడువేళ మీరు నిరూపించిన వీరోచిత సాహసకృత్యములు చిరస్థాయులుగ మనస్వాతంత్ర్య సమర చరిత్రలో సజీవములై నిలువ గలవు.

"సోదరులారా! ఈ క్లిష్టస్థితిలో నా యాదేశ మొకటి మాత్రమే. తాత్కాలికముగ మీరు లొంగవలసివచ్చిన నాకృత్యమును వీరులవలె నొనర్పుడు. మీరు పొందిన యున్నత శిక్షణమున కనుగుణ్యముగ వ్యవహరింపుడు. మీ యనంత త్యాగమువలన భవిష్యద్భారతమున నిక బానిసలు జన్మింపరు. అట్టి స్వేచ్ఛామూర్తుల మహోదయమునకు కారకులు మీరని గర్వింపుడు!

"వారు మీ సమరచరిత్రను స్వర్ణాక్షరములతో లిఖించి లోకమున బ్రకటింతురు. విజయకీర్తికై వైచిన మీ రాచబాటలో మీ పదచిహ్నముల ననుసరించి పురోగ మింతురు.

